

శ్రీ

# భాగవతరత్నములు.

## —• భాగవతము •—

ఆ॥ వేదకల్పవృక్ష • విగళితమయి శుక
ముఖసుధాద్రవమున • మొనసియున్న
భాగవతపురాణ • ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక • భావవిదులు!

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్ సువర్ణసుమన • స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల • వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వు:• ర్విన్ సద్ద్విజశ్రేయమై!

క. నిగమములు వేయిచదివిన
సుగమంబులుగావు ముక్తి • సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబుఁ బఠింపు ముక్తి • నివసనము బుధా!

ఆ. అతిరహస్యమైన • హరిజన్మకథనంబు
మనుజుఁడెవ్వఁడేని • మాపురేపు

చాలభక్తిఁ దోడఁ ♦ జదువుఁడా సంసార
దుఃఖరాశిఁ బాసి ♦ తొలఁగిపోవ॥

—♦మానవుఁడు♦—

తే. చేతులారంగ శివునిఁ బూ ♦ జింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి ♦ నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ ♦ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల ♦ కడుపుఁ జేటు॥

—♦భగవత్ప్రార్థన♦—

క. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి ♦ నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార నాకు ♦ దయసేయఁగదే॥

మ. నినుఁ జింతించుచుఁ బాడుచుం బొగడుచున్ ♦ నీదివ్యచారిత్రము
వినుచుం జూతురుగాక లోకు లితరా ♦ న్వేషంబులం జూతురే
ఘనదుర్జన్మపరంపరాదళన ద ♦ క్షంబై మహాయోగివా
గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ ♦ విశ్వేశ! విశ్వంభరా॥

శా. శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా ♦ శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్రవంశదహనా ♦ లోకేశ్వరా దేవతా
నీక బ్రాహ్మణగోగణార్తిహరణా ♦ నిర్వాణసంధాయకా
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ ♦ నిత్యానుకంపానిధీ॥

ఉ. ఏవిభునామకీర్తనము ♦ లేవిభుచింతయు నామకీర్తనం
బేవిభులీల లద్భుతము ♦ లెవ్వఁడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము ల ♦ భాయతవృత్తిఁ జెలంగునందు నే
నావిభు నాశ్రయించెద న ♦ ఘాఘనివర్తను భద్రకీర్తనున్॥

పరమేశు పాదయుగ ♦ మెవ్వఁడుఁ గోరి భజించు నెవ్వరుల్
లోపలిబుద్ధిఁ జూ నుభయ ♦ లోకములందుల జడ్డుఁ బాసి, యే
తాపములేక బ్రహ్మగతిఁ ♦ దారు జితశ్రములై చరింతు రే
ఆపరమేశు మ్రొక్కెద న ♦ ఘాఘనివర్తను భద్రకీర్తనున్॥

ఉ. తపములఁ జేసినైన మతి ♦ దానము లెన్నియుఁ జేసినైన నే
జపములఁ జేసినైన ఫల ♦ మందయు మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై నశింతవిప ♦ దాస్థితి నెవ్వనిఁ బొందుమందు, న
య్యపరిమితున్ భజించెద న ♦ ఘాఘనివర్తను భద్రకీర్తనున్॥

మ. యవనవ్యాధపుళిందహూణాకషకం ♦ కాభీరచండాల సం
భవులుం దక్షిణపాపవర్తనులు నే ♦ భద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల దాసి శుద్ధతనులై ♦ కల్యాణులై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో ♦ నశ్రాంతమున్ మ్రొక్కెదన్॥

మ. తపముల్ సేసిననో మనోనియతినో ♦ దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో ♦ సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌనని బ్రహ్మరుద్రముఖరుల్ ♦ భావింతు రెవ్వానిన
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తనుల భూ ♦ డౌఁగాక నాకెప్పుడున్॥

మ. అణువో స్థూలకుఁడో మహావిభవుఁడో ♦ యుచ్ఛిన్నుఁడో భిన్నుఁడో
గుణియౌమా నిర్గుణుఁడో యటంచు విబుధుల్ ♦ గుంభవత్తత్త్వమా
ర్గణులై యేవిభు పాదపద్మభజనో ♦ త్కర్షంబులం దత్త్వవి
క్షణముం జేసెదరట్టి విష్ణుఁ బరమున్ ♦ సర్వాత్ము సేవించెదన్॥

చ, అరయఁ బ్రశస్తభూతహృద ♦ యంబులయందు వసించి యేకమై
పరఁగి సుహృత్త్రియానుగుణ ♦ భాసితధర్ముఁడవుం బరావరే
శ్వరుఁడవునైన తెసర్వుచు న ♦ సజ్జనదుర్లభమైనయట్టి సు
స్థిరమగు సర్వభూతదయ ♦ చేఁ బొడఁగానఁగవత్తువచ్యుతా॥

ఉ. మానధనుల్ మహాత్ములు స ♦ మాధినిరూఢులు యన్ముఖాంబు
ధ్యానమరందపానమున ♦ నాత్మభయంబులఁ బాసి ముక్తులై
లూనతనొంద రట్టిముని ♦ లోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణికి ♦ సాధుజనాగ్రణికేను మ్రొక్కెదన్॥

—♦గజేంద్రమోక్షము♦—

శా. నానానేకపయూథముల్ వనములో ♦ నన్ బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీ ♦ నాథుండనై యుండి మ
ద్దానాంభఃపరిపుష్టచందనలతాం ♦ తచ్ఛాయలందుండ లే
కీనీరాశ నిటేలవచ్చితిభయం ♦ బెట్లోకదే యీశ్వరా॥

ఉ. ఎవ్వనిచే జనించు జగ ♦ మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందుఁ బర ♦ మేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాదిమధ్యలయుఁ ♦ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వానినాత్మభవు ♦ నీశ్వరు నే శరణంబు వేడెదన్॥

సీ. భవముదోషంబురూ ♦ పంబుఁగర్మంబునా,
హ్వాయములుగుణములు నె ♦ వ్వనికిలేక
జగములఁగలిగించు ♦ సమయించుకొఱకునై
నిజమాయనెవ్వఁ డీ ♦ ప్సితమునఁదాల్చు
నాపరమేశుక ♦ నంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూప ♦ హీనునకును
జిత్రచారునికి సా ♦ క్షికినాత్మరుచికిని
బరమాత్మునకుఁబర ♦ బ్రహ్మమునకు

ఆ॥ మాటలనెఱుకల ♦ మనములఁ జేరంగఁ
గానిశుచికి సత్త్వ ♦ గమ్యుఁడగుచు
నిపుణుఁడైనవాని ♦ నిష్కర్మతకు మెచ్చు
వానికే నొనర్తు ♦ వందనములు॥

సీ. శాంతున కపవర్గ ♦ సౌఖ్యసంవేదికి,
నిర్వాణభర్తకు ♦ నిర్విశేషు
నకు ఘోరునకు గూఢు ♦ నకు గుణధర్మికి
సౌమ్యున కధికవి ♦ జ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట ♦ కధ్యక్షునకు బహు
క్షేత్రజ్ఞునకు దయా ♦ సింధుమతికి
మూలప్రకృతి కాత్మ ♦ మూలున కఖిలేంద్రి
యజ్ఞాపకునకు దుః ♦ ఖాంతకృతికి

ఆ. నెఱి నసత్యమనెడి ♦ నీడతో వెలుఁగుచు
నుండు నెక్కటికిని ♦ బురుషోత్తమునకు
నిఖిలకారణునకు ♦ నిష్కారణునకు, న
మస్కరింతు నన్ను ♦ మనుచు కొఱకు||

సీ|| కలఁడే నాపాలి ♦ కలిమి సందేహింప
కలిమి లేములు లేక ♦ కలుగువాఁడు
నాకడ్డపడ రాఁడె ♦ నలిసాధువులచేఁ
బడిన సాధుల కడ్డ ♦ పడెడువాఁడు
చూడఁడే నా పాట్లు ♦ చూపులఁ జూడక,
చూచువారలఁ గృపఁ ♦ జూచువాఁడు
లీలతో నా మొఱా ♦ లింపఁడే మొఱఁగుల,
మొఱ లెఱుఁగుచుఁ దన్ను ♦ మొఱఁగువాఁడు

తే. అఖిలరూపముల్ దనరూప ♦ మైనవాఁడు
ప్రథమమధ్యాంతములు గానఁ ♦ బడనివాఁడు
భక్తజనముల దీనుల ♦ పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె ♦ వేగ రాఁడె||

శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలో ♦ లంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ ♦ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మ ♦ న్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద సం ♦ రక్షింపు భద్రాత్మకా!

ఉ॥ ఓకమలాప్త! యోవరద! ♦ యోప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో కవియోగివంద్య! సుగు ♦ ణోత్తమ! యోశరణాగతామరా
నోకహ! యోమునీశ్వర మ ♦ నోహర! యోవిమలప్రభావ! రా
వే కరుణింపవే తలఁప ♦ వే శరణార్థిని నన్నుఁ గావవే॥

మ॥ అలవైకుంఠపురంబులో నగరిలో ♦ నామూలసౌధంబు దా
పలమందారవనాంతరామృతసరః ♦ ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నా ♦ పన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహియనఁ గు ♦ య్యాలించి సంరంభియై॥

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం ♦ జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం ♦ బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివా ♦ దప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ♦ ప్రాణావనోత్సాహియై॥

మ॥ కరుణాసింధుఁడు శౌరి వారిచరముం ♦ ఖండింపఁగాఁ బంపె, స
త్వరితాకంపితభూమిచక్రము మహో ♦ ద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రము బహువిధ ♦ బ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాం ♦ ధశ్చక్రముం జక్రమున్॥

శా॥ భీమంబై తలఁద్రుంచి ప్రాణములఁ బా ♦ పెంజక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధరదేహముం జకితవ ♦ న్యేభేంద్రసందోహముం
గామక్రోధనగేహముం గరటిర ♦ క్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయ ♦ శ్రీమోహముం గ్రాహమున్

శా॥ పూరించెన్ హరి పాంచజన్యము గృపాం ♦ భోరాశి సౌజన్యమున్
భూరిధ్వాన చలాచలీకృత మహా ♦ భూతప్రచైతన్యమున్
సారోదారశితప్రభా చకిత ప ♦ ర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును ని ♦ ర్ధూతద్విషత్సైన్యమున్॥

—♦హరిభక్తి విశేషము♦—

కం॥ భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్త ♦ భీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోప ♦ చిత భాషణముల్॥

కం॥ శ్రీకరంబులు ఖండితసం
తాపకరంబులు కల్మషాంధ ♦ తమసమహోద్
దీపకరంబులు పాషండదురా
లాపకరంబులు విష్ణువంద ♦ నాలాపంబుల్॥

కం॥ పావనములు దురితలతా
లావనములు నిత్యమంగ ♦ ళప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ ♦ పదసేవనముల్॥

—♦హరినామకీర్తనములు♦—

సీ॥ బ్రహ్మహత్యానేక, పాపాటవులకగ్ని
కీలలు హరినామ ♦ కీర్తనములు
గురుతల్పకల్మష ♦ ఘోరసర్పములకు
కేకులు హరినామ ♦ కీర్తనములు
తపనీయచౌర్యాఘ ♦ తిమిరంబునకు సూర్య
కిరణముల్ హరినామ ♦ కీర్తనములు

మధుపానకిల్బిష ♦ మదనాగసమితికిఁ
గేసరుల్ హరినామ ♦ కీర్తనములు

తే. మహితయోగోగ్రనిత్యస ♦ మాధివిధుల
నలరు బ్రహ్మాదిసురులకు ♦ నందరాని
భూరినిర్వాణసామ్రాజ్య ♦ భోగభాగ్య
ఖేలనంబులు హరినామ ♦ కీర్తనములు॥

సీ॥ ముక్తికాంతాకాంత ♦ మోహనకృత్యముల్
గేలిమై హరినామ ♦ కీర్తనములు
సత్యలోకానంద ♦ సౌభాగ్యయుక్తముల్
గేలిమై హరినామ ♦ కీర్తనములు
మహితనిర్వాణసా ♦ మ్రాజ్యాభిషిక్తముల్
గేలిమై హరినామ ♦ కీర్తనములు
బహుకాలజనితత ♦ పఃఫలసారముల్
గేలిమై హరినామ ♦ కీర్తనములు

తే. గీ. పుణ్యమార్గంబు లనపాయ ♦ సౌఖ్యకంబు
లభిమతార్థంబులజ్ఞాన ♦ హరణకరము
లాగమాంతోపలబ్ధంబు ♦ లమృతసేవ
లార్తశుభములు హరినామ ♦ కీర్తనములు॥

—♦ కైలాసము ♦—

ఉ. భాసురలీలఁ గాంచిరి సు ♦ పర్వులు భక్తజనైకమానసో
ల్లాసముఁ గిన్నరీజనవి ♦ లాసము నిత్యవిభూతిమంగళా
వాసము సిద్ధగుహ్యకని వాసము ♦ చారువిరాజమానకై
లాసముఁ గాంతినిర్జితకు ♦ లక్షితిభృత్సుమహాద్రిభాసమున్

సీ. ధాతువిచిత్రితో ♦ దగ్రరత్నవిభా
సంగత జ్వాలాతుంగ ♦ శృంగములను
కిన్నరగంధర్వ ♦ కింపురుషాద్యకో
జననికరాకీర్ణ ♦ సానువులను
భాసితనిఖిలమై ♦ మానికమిథున వ
ద్విహారశైకసుభదరి ♦ దేశములును
గమనీయనవమల్లి ♦ కాసుమనోవల్లి
కామతల్లిల స ♦ త్కంధరములు
తే. గీ. సమరసిద్ధాంగనాశోభి ♦ తాశ్రమములు
విబుధజనయోగ్యసంపన్ని ♦ వేశములును
గలిగి బహువిధపుణ్యభో ♦ గముల నొప్పు
విమలసుకృతంబులకు దండ ♦ పండికొండ॥

—♦హరిభక్తివర్జితులు♦—

మ. హరిఁ జింతింపక మత్తుఁడై విషయచిం ♦ తాయత్తుఁడై చిక్కి వా
నరముల్ ద్రోసిన నాఁడు కింకరగదా ♦ సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమదండభృన్నివసన ♦ న్యారోపకంఠోగ్రుఁడై
తరణీవహ్నిశిఖాపరంపరలచేఁ ♦ దగ్ధుండు గాకుండునే॥

క. మొత్తుదురు గదల మంటఁ
గత్తెద రద్దంబు చేత ♦ ఖండితలుగా
నొత్తుదు రసికత్తికలను
హత్తుదురు కృతాంతభటులు ♦ హరిగతరహితులన్॥

—♦అర్జునుఁడు ధర్మరాజునకుఁ గృష్ణనిర్యాణముఁ దెల్పుట♦—

క. మనసారథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు ♦ మనబాంధవుఁడున్

మనవిభుఁడు గురుఁడు దేవర
మనలను దిగనాడిచనియె ♦ మనుజాధీశా॥

క. కంటకపు నృపులు సూడఁగ
మింటంగన్పించుయంత్రి ♦ మీనముఁగోలన్
గెంటించి మనసు వాలుం
గంటిం జేకొంటి మతని ♦ కరుణావశాదే॥

క. దండి ననేకులతో నా
ఖండలుఁ డెదురయిన గెలిచి ♦ ఖాండవవనముం
జండార్చికి నర్పించిన
గాండీవము నిచ్చెఁ జక్రి ♦ గలుగుటనధిపా॥

కం. దిక్కుల రాజుల నెల్లను
ద్రొక్కించి ధనంబుఁ గొనుట ♦ మయకృతసభము
న్నక్కట జన్నము సేయుట
నిక్కము హరి మనకుదండ ♦ నిలిచినఁగాదే॥

మ. ఇభజిద్వీర్యము ఖాభిషిక్తమగు నీ ♦ యిల్లాలిధమ్మిల్లమున్
సభలో శాత్రవు లీడ్చినన్ ముడువ తా ♦ చంద్రాస్యదుఃఖింపఁగా
సభయందిచ్చి ప్రతిజ్ఞసేసి భవదీ ♦ యారాతికాంతాళితో
జభరశ్రీలహరింపఁడే విధవలై ♦ సౌభాగ్యముల్ వీడఁగన్॥

శా. వైరుల్ గట్టినపుట్టముల్ విడువఁగా ♦ వారింప నావల్లభుల్
రారీవేళ నఃఖేత సేయుఁదగవే ♦ రావే నివారింపవే
శ్రీశా ద్రౌపతులఁ గృష్ణ! యంచు సభలో ♦ దీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం ♦ గాఁ జేయఁడే ద్రౌపదిన్॥

సీ. దుర్వాసుఁడొకనాఁడు ♦ దుర్యోధనుఁడు పంపఁ
బదివేల శిష్యులు ♦ భక్తిఁగొలువ

జనుఁదెంచి మునుముఁ జాఁగ ♦ నాలియుఁ గుడిచిన
వెనుక నాహారంబు ♦ వేఁడికొనినఁ
బెట్టెద ననవుడుఁ ♦ బెట్టకున్న శపింతు
ననుచుఁ దోయాడఁగా ♦ నామున కేఁగఁ
గడవల నన్నశా ♦ కములు దీఱుటఁ జూచి
పాంచాలపుత్త్రిక ♦ పర్ణశాల

తే. లోనఁ దలఁచిన విచ్చేసి ♦ లోవిలోని
శిష్టశాకాన్నలవముఁ బ్రా ♦ శించి తపసి
కోపముడిగించి పరిపూర్ణ ♦ కుక్షిఁ జేసె
నిట్టి త్రైలోక్యసంతర్పి ♦ యెందుఁగలఁడు!

సీ. పందికై పోరాడ ♦ ఫాలాక్షుఁ డెవ్వాని
బలమున వాకిచ్చెఁ ♦ బాశుపతము
నెవ్వనిలావున ♦ నిమ్మైన దేవేంద్రు
పీఠార్థమున నుండఁ ♦ బెంపుఁ గంటిఁ
గాలకేయ నివాత ♦ కవచాదిదైత్యులఁ
జంపితి నెవ్వని ♦ సంస్మరించి
గోగ్రహణమునాఁడు ♦ కురుకులాంభోధిఁ
గడచితి నెవ్వాని ♦ కరుణఁ జేసి

ఆ. కర్ణసింధురాజ ♦ కౌరవేంద్రాదుల
తలలపాగ లెల్లఁ ♦ దడవి తెచ్చి
యేమహాత్ము బలిమి ♦ నిచ్చితి విరటుని
పుత్త్రియడుగ బొమ్మ ♦ పొత్తికలకు!

మ. గురుభీష్మాదులుగూడి పన్నినకురు ♦ క్షోణీశచక్రంబులో
గురుశక్తిన్ రథయంత్రమై నొగలపైఁ ♦ గూర్చుండి యామేటినా

శరముల్ వారకమున్న నాగలములో ♦ త్రాణాయురుద్యోగత
త్పరతల్ చూడ్కులసంహరించుసమితిన్ ♦ త్రాణంబు నాకిచ్చుచున్॥

మ. అనుకంపన్ గురుఁడొండొనరించు కృత్యములు పె ♦ ద్దాదుంబ్రవేశించి గ
ల్వానసమర్థంబులుగాని కైవడిఁ గృపా ♦ శ్వత్థామగాంగేయ సూ
ర్యసుతద్రోణధనుర్విముక్తమహాది ♦ శస్త్రప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవు దయా ♦ దృష్టిన్ నరేంద్రోత్తమా॥

చ. పసుపతి దివ్యబాణముల ♦ ప్రక్కలు పాపి కోలంఱు సేసి నా
రసములు నాటుగాఁబఱపి ♦ రథ్యములన్ రిపులెల్లఁజూడ సా
హసమున నిల్పఁబెట్టితి గ ♦ దా వడి సైంధవుఁ జంపువాఁడు నా
కసురవిరోధి భద్రిగతి ♦ నండయివచ్చెఁగాదె భూవరా॥

సీ. చెలికాఁడ రమ్మని ♦ చీరు నొక్కక వేళ
మన్నించు నొకవేళ ♦ మఱఁది యనుచు
బంధుభావంబునఁ ♦ బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ♦ ధనములిచ్చు
మంత్రియై యొకవేళ ♦ మంత్రమాదేశించు
బోధియై యొకవేళ ♦ బుద్ధిచెప్పు
సారథ్యమొనరించుఁ ♦ జనువిచ్చి యొకవేళఁ
గ్రీడించు నొకవేళ ♦ గేలిసేయు

తే.గీ. నొక్కశయ్యాసనంబున ♦ నుండుఁ గన్న
తండ్రికైవడిఁ జేసిన ♦ తప్పుఁగాచు
హస్తములుపట్టి పొత్తున ♦ నారగించు
మనుజవల్లభ మాధవు ♦ మఱపురాదు॥

కం. విజయ ధనంజయ హనుమ
ద్ధ్వజ ఫల్గున పార్థ పాండు♦తనయ నర మహేం

ద్విజమిత్రార్జున యంచును
భుజములు తలకడవ రాక ♦ పోఁకలఁ జేరున్॥

కం. వారిజగంధులు దమలో
వారింపఁగరాని ప్రేమ ♦ వాదము సేయన్
వారిజనేత్రుఁడు నసుఁదగ
వారిండ్లకుఁ జనువు పలుకి ♦ వారింపన్నృపా॥

కం. పిచ్చలు లోకులు కాంతలు
మచ్చికఁ దనతోడవాఁడు ♦ మాటలు నాకున్
ముచ్చటలు సెప్ప బిల్లన
విచ్చలవిడిఁ దొడలమీఁద ♦ విచ్చేసినృపా॥

చ. అటమటమయ్యె నా భజన ♦ మంతయు భూవర! నేఁడు సూనుమా
యిటువలె గారవించు జగ ♦ దీశుఁడు కృష్ణుఁడు లేఁడు పిమ్మటం
బటుతర దేహలోభమునఁ ♦ బ్రాణములున్నవి వెంటఁబోక నే
నటకట పూర్వజన్మమునఁ ♦ గర్మము లెట్టివి చేసినాఁడనో॥

శా. కాంతారంబున నొంటిఁ దోడుకొని పోఁ ♦ గాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బరాభవేల పదరా ♦ గాయత్తులై తాఁకి నా
చెంతం గోదండముఁ గూర్చి యెక్కిడఁగ ♦ సీమంతినీసంఘముల్
భ్రాంతిన్ భామినీ భంగినుంటి విడిచి ♦ కటా లేక ధాత్రీశ్వరా॥

శా. ఆ తేరా రథికుండు నా హయములా ♦ యస్త్రాసనం బా శర
వ్రాతంబన్యులఁ దొల్లి చంపు ఘనుఁడిట్ ♦ వ్యర్థంబులై పోయెను
చ్చేలోధీశుఁడు చక్రి లేమి భసిత ♦ క్షిప్తాజ్యమా యూషరా
యాతంత్రోప్తవరభూమి బీజముల మ ♦ ర్యాద స్వప్నమేమంబులన్॥

మ. యదువీరుల్ మునినాథ శాపమునఁ గా ♦ లాధీనులై యుండఁగన్
మదిరాపానవివర్ధమానమద న ♦ మ్యగ్రోగ్ర రోషాంధులై

కదనంబుల్ దమలోన ముష్టిహతులం ♦ గావించి స్త్రైరి స
ష్టదశంజిక్కిరి నల్గురేగు రచటన్ ♦ సర్వంసహావల్లభా॥

కం. భూతములవలనఁ నెప్పుడు
భూతములకు జన్మమరణ ♦ పోషణములు ని
ర్ణీతములు సేయుచుందును
భూతమయుఁడీశ్వరుండు ♦ భూతశరణ్యా॥

కం. బలములు గల మీనంబులు
బలవిరహిత మీనములను ♦ భక్షించుక్రియన్
బలవంతులయిన యాదవులు
బలరహితునిఁ జంపి రహిత ♦ భావములన్నృపా॥

మ॥ బలహీనాంగులకున్ బలాధికులకుం ♦ బ్రత్యర్థిభావోద్యమం
బులు గల్పించి వినాశమున్ నెఱపి యీ ♦ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిన్ గృతకార్యుఁడై చనియె నా ♦ సర్వేశ్వరుండచ్యుతుం
డలఘుం డేమని చెప్పఁగున్ భగవదీ ♦ యాయత్తమూర్తీశ్వరా॥

—మైత్రేయుఁడు కృష్ణునిఁ జూచుట—

మ॥ కసియెం దానవపుంగవుం దఖలలో ♦ కఖ్యాతవర్ధిష్ణు శో
భనభాస్వత్పరిపూర్ణయౌవనకళా ♦ భ్రాజిష్ణు యోగీంద్ర హృ
ద్వనజాతైకచరిష్ణుఁ గౌస్తుభముఖో ♦ ద్యద్భూషణాలంకరి
ష్ణు, నిలింపాహిత జిష్ణువిష్ణుఁ బ్రభవి ♦ ష్ణుంగృష్ణురోచిష్ణునిన్॥

—ఈశ్వరునకుఁ గర్మబంధములు లేవు—

చ. లలితవిలోలనిర్మల జ ♦ లప్రతిబింబితపూర్ణచంద్రమం
డలము దదంబుచాలన వి ♦ డంబన హేతువునొందియున్ వియ
త్తలమునఁ గంపమొందనివి ♦ ధంబునఁ సర్వశరీరధర్మముల్
గలిగి రమించు నీశునకు ♦ గల్గఁగ నేరవు కర్మబంధముల్॥

—యజ్ఞవరాహావతారము—

సీ. కఠిన సటాచ్ఛటో ♦ త్కటజాతవాతని,
ర్ధూతజీమూత సం ♦ ఘాతముగను
క్షురనిభసునిశిత ♦ ఖురపుటాహతచల
త్ఫణిరాజదిగ్గజ ♦ ప్రచయముగను
ఖండదంష్ట్రోత్థితక్ష్మా ♦ శ్వానగర్భచ్ఛన్నప్ర
దళితహేమాద్రిప్ర ♦ సరంభముగను
ఘోరగంభీరఘు ♦ ర్ఘురభూరిని స్వన
శంకితాఖిలవార్ధి ♦ సంఘములుగఁ
తే. బొరలు గొరలు నటించు సం ♦ బరము దెరల
రొప్పు చుప్పరమొగసూను ♦ గొప్పరించు
మిట్టిబిగియించు మూపున ♦ మురారుకొనుచు
వదరు సంరక్షితక్షోణి ♦ యజ్ఞఘోణి॥

—చక్రిము—

మ. కుతలోద్ధర్త మనంబునం దలఁచె ర ♦ క్షోరాడ్వధార్థంబుగా
దితిసంతానకులాటవీమహిత సం ♦ దీప్తప్రభాశుక్రియన్
సతతోద్యజ్జయశబ్దసమ్ముఖరభా ♦ స్వచ్ఛక్రియన్ సంతతా
శ్రితనిర్వక్రియుఁ జాలితప్రకటధా ♦ త్రీచక్రుఁడుం జక్రియున్॥

—కిటి—

కం॥ దిటచెడి లోఁబడె దైత్యుఁడు
సటికికి దంష్ట్రావిభిన్న ♦ శత్రుమహోగ్ర
స్తటికికి ఖరఖురపుటికిం
గటితటహాటకమలజాండ ♦ ఘటికింగిటికిన్

— శ్రీహరిపదములు —

సీ. హలకులిశాంకుశ ♦ జలజధ్వజచ్ఛత్ర
లాలితలక్షణ ♦ లక్షితములు
నలలితనఖచంద్ర ♦ చంద్రికానిర్ధూత
భక్తమానసతమః ♦ పటలములును
సురుచిరాంగుష్ఠని ♦ ష్ఠ్యూతగంగాతీర్థ
ఖండితహరజటా ♦ మండలములు
సంచితధ్యానప ♦ రాయణజనభూరి
కలుషపర్వతదీర్ఘ ♦ కులిశములును
తే. దానవలోకమనోరథ ♦ దాయకములు
చారుయోగిమనః పద్మ ♦ షట్పదములు
సనకసనందనవినుత హరిచర ♦ ణాబ్జములను
నిరుపమధ్యానమున మది ♦ నిలుపవలయు॥

కం॥ తరణంబులు భవజలధికి
హరణంబులు దురితలతల ♦ కాగమములకా
భరణంబు లార్తజనులకు
శరణంబులు నీదు దివ్య ♦ చరణంబు లిలన్॥

— పాపులను యమభటులు పెట్టుబాధలు —

కం. పట్టుదురు కొలపులను వడి
బెట్టుదు రసిపత్త్రికలను ♦ బెనుమంటలయం
దొట్టుదు రొడళ్ళు నలియన్
మొట్టుదు రప్పాపచిత్తు ♦ మొత్తుం బెలుచన్॥
ఉ. ముంతురు తప్తతోయముల ♦ నొత్తురు దుర్గ్రహసిధానలం
దెంతురు పొట్టప్రేవులు వ ♦ ధింతురు మీఁద నిభేంద్రదంతక...

ప్పింతురు ఘోరభోగిగణ ♦ పిడుగుల పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు మదగజంబుల దిని ♦ చింతురు దేహము గోసి కండలన్॥

—మోక్షమార్గము—

సీ॥ జనులెల్ల సర్థవాం ♦ ఛలఁ జేసి యత్యంత
మూఢులై మోహాకం ♦ బున మనంబు
లందును గోరుదు ♦ రల్పసౌఖ్యములకు
నన్యోన్యవైరంబు ♦ లంది దుఃఖ
ములఁ బొందుచుందురు గాన ♦ మునుకొని గురుఁడైన
వాఁడు మోక్షమార్గము ♦ వసుధ నెంత
జడుఁడును నైనట్టి ♦ జంతువునకును
దయగల్గి మిక్కిలి ♦ ధర్మబుద్ధి॥

ఆ. కన్నులున్నవాఁడు ♦ గానని వానికి
దెరువుఁ జూపినట్లు ♦ దెలియఁ బలికి
యతులననుచు దివ్య ♦ మైన మోక్షమా
ర్గంబుఁ జూపవలయు ♦ రమణతోడ॥

—విష్ణుఁడే దైవము—

సీ. భూతజాలములందు ♦ భూజముల్ వ్యర్థముల్
భూరుహములకంటె ♦ భోగికులము
భోగిసంతతికన్న ♦ బుద్ధిమంతులు బుద్ధి
మంతులకన్నను ♦ మనుజవరులు
వీరికన్నను సిద్ధ ♦ విబుధగంధర్వులు
వారికన్నను సురల్ ♦ వారికన్న
నింద్రాగ్నిదేవత ♦ లిందఱికన్నను
దక్షాదిసన్మునుల్ ♦ దలఁప నెక్కు

తే. గీ. దంతకన్నను భర్తుండా ♦ యాభవుకన్నఁ
గమలభవుఁ డెక్కుడాతని ♦ కంటె విష్ణుఁ
డధికుఁ డాతఁడు విప్రుల ♦ నాదరించుఁ
గానవిప్రుండు దైవంబు ♦ మానవులకు॥

—అజామిళుఁ డంత్యకాలమునఁ దానొనర్చినపాపములకుఁ
బశ్చాత్తాపమునందుట—

సీ. వృషలిచుందనురాగ ♦ వృద్ధిబిడ్డలఁగని
కులమునగోదాఖరిఁ ♦ గూలఁద్రోచి
రచ్చలనెక్కి పెం ♦ ద్రజ్జసేతలసరి
వారిలో కలదల ♦ వంపుచేసి
కట్టడిమందుకనై ♦ కర్మబంధంబుల
పుట్టనై సిందల ♦ పోవనగుచు
దగుణులరోతలఁ ♦ దవ్విభోగించిన
కడిది వాజన్మంబుఁ ♦ గాలిపోయె
ఆ. జదువు చట్టవడెరో ♦ శాస్త్రంబుమన్నయ్యె
బుద్ధి పురువుమేసెఁ ♦ బుణ్యమడఁగె
నీతిమట్టువడెరో ♦ నిగ్మలజ్ఞానంబు
ముట్టసురిగె బోధ ♦ మూరిఁ బోయె॥

క. చిక్కని చక్కని చన్నుల
మక్కువ యిల్లాలివిడిచి ♦ మాయాలుగలయా
వెక్కసపుమద్యపానపు
డొక్క ఖనం దగిలి దుర్వి ♦ టుఁడనై చెడితిన్॥

ఉ. అక్కట! ఘోరదుష్కృతమ ♦ హానలకీలలు నన్ను ముట్టిపే
రుక్కడగింప కిట్లు ధృతి ♦ నుండఁగ నిచ్చె? హహా దురాత్ముఁడన్

గ్రక్కునఁ దల్లిదండ్రుల న ♦ కల్మషచిత్తులఁ బెద్దలన్ మతే
దిక్కును లేనివారిఁబలు ♦ దీనులఁ బెట్టుచుఁ బారదోలితిన్॥

క. అకృతజ్ఞుఁడనై విడిచితి
సత్కృతిఁగల బంధువులను ♦ బాల్యమునందున్
దుష్కృతిఁ బడకుండఁ బెంచిన
సుకృతుల సజ్జనకవరుల ♦ శోభనకరులన్.

వ.—అప్పుడు॥

ఆ. పెక్కు పాతకముల ♦ భృశదారుణంబైన
దొడ్డనరకమందుఁ ♦ బడ్డనన్ను
నాకుదలఁకుఁ బాపి ♦ యరికట్టి రక్షించు
నిట్టిధర్మపురుషు ♦ లెందువారొ॥

శా. చోద్యంబై కలవోలె నిక్షణమునం ♦ జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యంబయ్యెనునన్ను పిల్చినమహా ♦ వీరుల్ భృశోదగ్రులా
యుద్యోగంబులవారు పాశధరులీ ♦ యుత్సాహముల్ మాని సం
పాద్యానేకపకారరూఢకుటిల ♦ ప్రఖ్యాతులెం దేగిరో॥

ఉ. దారుణపాశబంధనవి ♦ ధానములన్ నరకాగ్నిపంబులో
గూరినవానినన్నుఁ జెడ ♦ కుండ నొనర్చినపుణ్యమూర్తు లం
భోరుహనేత్రు లుజ్జ్వలన ♦ భోమణితేజులు లోచనోత్సవుల్
చారుదరాననముంచితవి ♦ చారులు నల్వురు నెందుఁబోయిరో॥

మ. ఇను గతించినపుణ్యవంతులు కనన్ ♦ నాళీకపత్రాక్షులం
బుదపుంజాభులు శంఖచక్రధరులా ♦ జానూరుబాహుల్ స్మితా
ననులాలంబితకర్ణవేష్టనులు వ ♦ ర్ణచ్ఛాయుదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సమ ♦ గ్రస్ఫూర్తి నెందేగిరో॥

వ. పాతకుండనగు నాకు నవ్విబుధోత్తముదర్శనంబు పురాకృతంబులగు పుణ్యవిశేషంబులంగాని దొరకనేరదు. తత్సందర్శనంబాత్మకు

నతిసుభ్రస్నంబులు యొప్పునట్లుగాకుండ నేసిన గుణవర్తనంబున వృషలీభర్తనైయుండి మృతిఁబొందుచున్న నాజిహ్వకు శ్రీమన్నారాయణ నామగ్రహణంబు సంభవింపనేరదు. మఱియును.

ఆ. పాతకుండ జడుఁడ ♦ బ్రహ్మఘాతుకుఁడను
మానలోభ మోహ ♦ మత్సరుండ
నాకు నెట్లు దొరకు ♦ నారాయణునిదివ్య
నామవిమలకీర్త ♦ నంబువుదికి॥

సీ. దారుణమోహాంధ ♦ కారపూరితుఁడను
హరివిస్మయస్మర ♦ ణార్హమతిని
కంచమహాతీవ్ర ♦ పాతకోపేతుఁడ
హరివిస్మయస్మర ♦ ణార్హమతిని
కౌటిల్యకితవవి ♦ కారపారీణుండ
హరివిస్మయస్మర ♦ ణార్హమతిని
యఖిలదుఃఖైక ఘో ♦ రార్ణవమగ్నుండ
హరివిస్మయస్మర ♦ ణార్హమతిని

తే గీ. నిందలకు నెల్ల నెలవైన ♦ నిర్గుణుండ
మందభాగ్యుండ నే నేడ ♦ మధువిదారి
దివ్యగుణనామకీర్తన ♦ తెలిఁగ దేడఁ
బూర్వసుకృతంబు గాకెట్లు ♦ పొందఁగలుగు॥

వ॥ అనివితర్కించి,

మ. యతచిత్తేంద్రియ మారుతుండనగుచున్ ♦ యత్నంబొనర్తున్ హరి
ప్రీతసంతత్తికిఁ బుద్ధ్యావృత్తికిఁ జిదా ♦ పాపోన్ముఖానక్తికిన్
యుతనిర్వాణదదానురక్తికి సుఖో ♦ ద్యోగక్రియాశక్తికిన్
ధృతలబ్ధోత్తమముక్తికిన్ సకలధా ♦ త్రీధుర్యసద్భక్తికిన్॥

క. విడిచితి భవబంధంబుల
నడచితి మాయావిమోహ ♦ మైసలిమంబు
న్విడిచితి సరివర్గంబుల
గడిచితి నాజన్మదుఃఖ ♦ కర్మార్ణవముల్ ॥

క. మోపి ద్రోహంబునసను
నీమణముఖగహ్వాగముస ♦ నెగమ్రింగుచు బ
ల్వేషమున గోతిసేసిన
దోషదయుగు నాత్మమాయం ♦ దోలంగంగంటిన్ ।

వ. అనియిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునందోచిన నాబ్రాహ్మణుండు,

మ. భగవద్ధర్మపరాయణోత్తములసం ♦ భాషిక మంత్రింబులన్
మిగులన్ జ్ఞనముపుట్ట మోహాభవన ♦ మ్మిశ్రాత్మబంధంబులం
దెగఖండించి సబంధుమిత్రసుతరు ♦ త్నమోహాపిశాంతుండై
జగతీనాథు రమేశుకృష్ణుసదయై ♦ శ్వర్యంబులంగోరుచున్.

కం. హరిభక్తులతో మాటలు
పరసెస్న్నడుం జెడసపుణ్య ♦ ధనముల మాటలే
పర్తముక్తి కాంత కేటలు
సరిమద్వర్గంబు చోరని ♦ యురుదగుకోటల్ ॥

సీ. అనుచు నాబ్రాహ్మణుం ♦ డతితత్త్వవేదియై
భవబంధముల నెల్ల ♦ బారందోలి
మొనసి గంగాద్వార ♦ మునకేగియచ్చట
కంబిన దేవాల ♦ యంబునందు
నాసీనుడై యోగ ♦ మాశ్రయించి చెలంగు
దేహేంద్రియాదుల ♦ తెరువు వలన

దనుఁ బాపుకొని పర ♦ తత్త్వంబుతోఁ గూర్చి
మానుగా యోగస ♦ మాధిచేత

ఆ. గుణగణంబు బాసి ♦ కామరొప్పిన భగవ
దనుభవాత్మయందు ♦ నాత్మఁగలిపి
రమణఁ దన్ను మొదల ♦ రక్షించినట్టియా
పురుషవరులఁ గాంచి ♦ పొసఁగ మ్రొక్కు॥

—: భాగవతులు. :—

సీ. శ్రుత్యంతవిశ్రాంత ♦ మత్యను క్రమణీయ
భగవత్ప్రసంగతుల్ ♦ భాగవతులు
సనకాదిమునియోగి ♦ జనపదానందైక
శుభభాగ్యోదయుల్ ♦ భాగవతులు
కృష్ణకథధ్యాన ♦ కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీ ♦ భాగవతులు
బహుపాతకాసక్త ♦ పరిభవప్రక్రియా
పరుషోగ్రమార్తులు ♦ భాగవతులు

తే. గీ. భావతత్త్వార్థ వేదులు ♦ భాగవతులు
బ్రహ్మవాదానువాదులు ♦ భాగవతులు
సిరులఁ దొలఁగంగ నెన్నఁడు ♦ జేటులేని
పదవి నొప్పారు వారువో ♦ భాగవతులు॥

—వృత్రాసురవధార్థంబు దేవతలు దధీచిఁ వెన్నుముకనిమ్మని గోరుట.—

వ॥ దేవతలు దధీచిమునికడకుం జని యుపాయంబులం బురస్కరించుకొని యిట్లనిరి.

ఆ. దేహి సుఖముఁ గోరి ♦ దేహంబు ఘటియించు
దేహి విడువలేఁడు ♦ దేహమెపుడు

దేహి యాస్పదీయ ♦ దేహంబు కొలుకు నై
దేహ మీఁగదయ్య ♦ దేవతలకు॥

ఉ. ఎక్కడ నెలలోకముల ♦ నెవ్వరుఁగోరని కోర్కె నేఁడు మా
తెక్కలిపాటు కైతివిరి ♦ దేహము వేఁడఁగ వచ్చి వాఁగ మే
మెక్కడఁ దీవ్రికర్మగతి ♦ నొక్కడ దైవకృతంబుగాక యీ
రొక్కపుదాన మీవరుస ♦ నోయక వేమి గురో జగంబులన్॥

క. నీచగతి యొల్లభంగుల
సూచనయుఁ దెలిసి తగఁ ♦ దమగురు రేని
సూచక వర్గములోఁ బలె
నీచులు లనఁబడరె యెంత ♦ నేర్పరులయినన్॥

క. అడుగంగరాని వస్తువు
లడుగరు బ్రతియాలిమెట్టి ♦ యర్థులు నేను నే
మడిగితిమి దేహ మెల్లను
గడుపడిగెను వారికేడ ♦ కరుణామహాత్మా॥

ఉ. వావుడు నా దధీచియును ♦ నంబున సంతసమంది నవ్వి సం
భావితవాక్యపద్ధతులఁ ♦ బల్కుచు నిట్లనెఁ బెల్లుగోడ నో
దేవతలార! ప్రాణులకుఁ ♦ దెక్కలి మృత్యుభయంబు పూనుటే
భావములం దలంపరు కృ ♦ పామతినెన్నఁడు మానసంబులన్॥

ఆ. ఎలమి బ్రతుకనిచ్చ ♦ యుంచినవారికి
దేహ మెల్ల భంగిఁ ♦ దీపుగాదె
యచ్యుతుండు వచ్చి ♦ యర్థించెనేనియుఁ
దన్నువిచ్చునట్టి ♦ దాత గలఁడె॥
అదియునుఁ గాక,

సీ. అర్థంబు వేడెడు ♦ నర్థులు గలరు గా
కంగంబు వేడెడి ♦ యర్థి గలఁడె

తగు కోరికల నిచ్చు ♦ దానశీలుండుగాక
దనదేహ మీనేర్చు ♦ దాత గలఁడె
యీనేర్చువాఁడు ద ♦ న్నిచ్చిన రోయక
చంపెడునట్టి యా ♦ చకుఁడు గలఁడె
చంపియుఁ బోవక ♦ శల్యంబు లన్నియు
నేతిహింసకఁ బోవు ♦ వారుగలరె

ఆ. రమణ లోకమెల్ల ♦ రక్షించువారికి
హింససేయుబుద్ధి ♦ యెట్టువొడమె
బ్రాఁతిరైనయట్టి ♦ ప్రాణంబుపైఁదీపు
తమకుఁ బోలెనెదిరి ♦ దలఁపవలదె॥

వ॥ అనిన దేవతలిట్లనిరి॥

తే. సర్వభూతదయాపర ♦ స్వాంతులకును
బుణ్యవర్తనులగు మిమ్ము ♦ బోఁటివారి
కమితసత్కీర్తికాముల ♦ కలఘుమతుల
కియ్యరానిపదార్థంబు ♦ లెవ్విగలవు॥

ఆ. అడుగరాని సొమ్ము ♦ నడుగరాదని మానఁ
డడుగువాని మాట ♦ లడుగనేల
బ్రాంతినడుగుచోటఁ ♦ బ్రాణంబులేనియు
నిచ్చువాఁడు దాతఁ ♦ డిచ్చుఁగాని॥

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు గార్యపరతఁ స వినయవాక్యపరంపరలఁ బ్రార్థించిన, నతండు దరహాసితభాసితవదనుండై యఖిలలోకధర్మం బెఱింగియు, నొక్కింతకాలంబు ప్రతివాక్యంబిచ్చితి. దీనిసహింపందగుదురు. మీయట్టివారలకుఁ బ్రియంబగునేని నశ్వరంబైన విడువందగినశరీరము విడుచుటయేమిదుర్లభం బధ్రువం

డైన యీశరీరంబుచేత గృత్రిమసుకృతంబుల నవ్వాండార్జింపబడుచు నరకం
బు పాషాణాకులకంటక నతికష్టంబు నీయాయుష్టిపూర్ణమ్యోక్తులచేత నాశిం
పంబడిన యీశరీరంబు బహిర్మేయుఁ డార్జితంబై దేహంబుచేత నేనియు
సకలభూతంబులు శోకానుభవంబున శోకించు, హర్షానుభవంబున హ
ర్షించునట్టి మహాకష్టదైన్యాకరంబైన యీశరీరంబు కాకశునకసృగా
లాదులపాలుగాకుండ మేలమ్యోనుఁ నిశ్చితాత్ముండయి దధీచిదత్త్వాలో
కనంబుచేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియవ్యానసంబులతోఁ గూడిన
క్షేత్రజ్ఞుని బరబ్రహ్మస్వరూపుండైన భగవంతునందు నేకీభూతుని జేసి
యోగజ్ఞానమున శరీరంబువిడిచె

## —। ధాత. ।—

ఉ. ధాతకు దేవతావిభవ ♦ ధాతకుఁ బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహిత ♦ దాతకు వైదికధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవ ♦ నేతకు సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన ♦ భావవిజేతకు మ్రొక్కెదన్॥

శా. దివిజానీకవిరోధి మ్రొక్కఁగని హా ♦ దేవీమనో నేతకున్
సవిశేషోత్సవ సంవిధాతకు నమ ♦ త్సంత్రాతకున్ సత్త్వవో
నివహాభీష్టవరప్రదాతకు జగ ♦ న్నిర్మాతకున్ ధాతకున్
వివిధప్రాణి లలాటలేఖన మహా ♦ విద్యానుసంధాతకున్॥

## —।నీతిపద్యములు।—

ఉ. మాఱుపడంగ లేని యువ ♦ మద్గుల పుత్రుల నస్త్రవిద్యలం
దేఱిన చిన్నవాలవ ♦ ధించెనిశీథమునందుఁ గ్రూరుఁడై
పాఱుఁడుగాని పాతకుఁడు ♦ ప్రాణభయంబున వెచ్చనూర్పుచుం
బాఱెడివీనిఁగావుము కృ ♦ పామతినర్జున! పాపవర్జనా॥

చ. వెఱచినవాని దైన్యమున ♦ వేదురునొందిన వాని సిద్రమై
మఱచినవాని సౌఖ్యమున ♦ మద్యము ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధుజన ♦ భావము వానిని గావుమంచు వా
చఱచినవానిఁ గామినుల ♦ జంపుట ధర్మముగాదు ఫల్గునా॥

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణా ♦ శగంబుసాశించి య
న్యప్రాణులచేత రక్షణము సే ♦ యంజూచు వాఁ డంత్యలో
కప్రాప్తుండగు రాజదండమున నా ♦ కల్యాణుఁడౌ నైననీ
విప్రుం దండితుఁ జేయ నేటికి మహా ♦ విభ్రాంతి చేనుండఁగన్॥

క॥ సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల ♦ భంజించినరా
జాధము డాయుస్స్వర్గ
శ్రీధనములు వీటిబోవు ♦ సిద్ధము తల్లీ॥

క॥ దుష్టజననిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు ♦ జేయుఁగ నృపులన్
సృష్టి విధించెఁ బురాణ
ద్రష్టలు చెప్పుదురు పరమ ♦ ధర్మము తల్లీ!

క॥ పొడిచినఁ బట్టినఁ గొట్టిన
బడుచుందురుగాని పరమ ♦ భాగవతులు దా
రొడఁబడరు మాఱుసేయఁగఁ
గొడుకా! విభుఁడగ్గు సేయుఁ ♦ గోరఁడు నికున్॥

సీ. వినుకర్షణాదిక ♦ వృత్తి కంటెను మేలు
యాచింప నొల్లని ♦ యట్టివృత్తి
ప్రాప్తంబుగైకొని ♦ బ్రదుకుకంటెను లెస్స
యనుదినంబును ధాన్య ♦ మడిగికొనుట

యాయావారము కంటె ♦ నధికలావణ్యంబు
వతిగ యొన్నల ధాన్య ♦ భక్షణంబు
శిలవృత్తి కంటెను ♦ శ్రేయమూ వణముల
బడ్డగింజలు దిసి ♦ బ్రతుకు గనుట

ఆ. పొడరు చోట నృపతి ♦ కీనాల్గువృత్తులు
దగు; బ్రతిగ్రహంబు ♦ దగదు తలఁప
నాపదవసరముల ♦ నధముఁ డెక్కువజాతి
వృత్తినున్న దోష ♦ విధము గాదు॥

క॥ దమమును శౌచము దపమును
శమమును నార్జవము కృపయు ♦ సత్యజ్ఞాన
క్షమలును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రి ♦ జాతికి నధిపా॥

ఉ॥ శౌర్యము, దానశీలము, బ్ర ♦ సాదము, నాత్మజయంబు, తేజమున్
ధైర్యము, దేవభక్తియును ♦ ధర్మము, నర్థముఁ గామమున్. బుధా
చార్యముకుందసేవలును ♦ సత్కృతియుం, బరిపోషణంబు న
ద్వీర్యము, రక్షణంబుఁ బృథి ♦ వీవరశేఖర! రాజచిహ్నముల్॥

క॥ ధర్మార్థకామవాంఛయు
నిర్మల గురుదేవ విప్ర ♦ నివహార్చనముల్
నిర్మదభావము బ్రమదము
శర్మకరత్వమును వైశ్య ♦ జనలక్షణముల్॥

చ॥ స్తేయము లేనివృత్తియు, శు ♦ చిత్వము, సన్నుతియున్, నిజేశులం
మాయలు లేక డాయుటయు ♦ మంత్రము సెప్పక పంచయజ్ఞముల్
సేయుటయున్, ధరామరుల ♦ సేవయు, గోవుల రక్షణంబు, న
న్యాయము లేమియున్ మనుజ ♦ నాథ! యెఱుంగుము శూద్రధర్మ
ముల్॥

క॥ ఎవ్వాఁడు దనకును సత్త్వము
చొప్పడునందాఁకరిపులఁ ♦ జూచియుఁ దనకై
గప్పికొని యుండవలయును
నొవ్వఁగ సహిం మా మశకమున ♦ కొదిగినభంగిన్।

—♦ పతివ్రత ♦—

సీ॥ నిలయంబు వాటించి ♦ నిర్మలదేహయై
శృంగారమొప్పిద్దఁ ♦ జేయవలయు
సత్యప్రియాలాప ♦ చతురయై ప్రాణేశు
చిత్తంబు ప్రేమరం ♦ జింపవలయు
దాక్షిణ్యసంతోష ♦ ధర్మమేధాదుల
దైవతమనిప్రియుఁ ♦ దలఁపవలయు
నాథుఁ డేపద్ధతి ♦ నడచు నాపద్ధతి
నడచి సద్బంధుల ♦ నడపవలయు
ఆ॥ మార్దవమునఁ బతికి ♦ మజ్జనభోజన
శయనపానరతులు ♦ జరపవలయు
విభుఁడు పతితుఁడైన ♦ వెలది పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి ♦ మనుపవలయు।
క॥ తరుణి దన ప్రాణవల్లభు
హరిభావముగా భజించి ♦ యతఁడుం దానున్
సిరికైవడి వర్తించును
హరిలోకమునందు సంత ♦ తానందమునన్॥
కం॥ ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్త ♦ దైవతమని ని
ష్కపటతఁ గొల్చిన సాధ్వికి
నృపవర! దుర్లభము లేదు ♦ సకలజగములన్।

## —♦ వైరాగ్యము ♦—

సీ॥ కమనీయభూమిభా ♦ గములు లేకున్నవే
    పడియుండుటకు దూది ♦ పరుపు లేల
సహజంబులగు కరాం ♦ జలులు లేకున్నవే
    భోజనభాజన ♦ పుంజమేల
వల్కలాజినకుశా ♦ వళులు లేకున్నవే
    కట్టదుకూలసం ♦ ఘంబు లేల
గొనకొని వసియింప ♦ గుహలు లేకున్నవే
    ప్రాసాదసౌధాది ♦ పటలమేల

తే॥ ఫలరసాదులు గురియవే ♦ పాదపములు
స్వాదుజలములు నుండవే ♦ సకలనదుల
బొసఁగ భిక్షంబు పెట్టరే ♦ పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల ♦ తాపసులకు॥

క॥ రక్షకులు లేనివారల
రక్షించెద ననుచుఁ జక్రి ♦ రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు
పక్షముఁ బ్రార్థింపనేల ♦ యాత్మజ్ఞులకున్॥

మ॥ హరిఁ జింతింపక మత్తుఁడై విషయచిం ♦ తాయత్తుఁడై దిక్కులా
వరముల్ ద్రోసెను నాఁడు కింకరుఁడు దా ♦ సంతాపితస్వాంతుఁడై
ధరణీశోత్తమ! దందశూకనివహ ♦ స్వాంగోపరింతోగ్రమై
తరణీవహ్ని శిఖాపరంపరలచే ♦ దగ్ధుండు గాకుండునే.

సీ॥ వాసుదేవశ్లోక ♦ వార్తలాలించుచుఁ
    గాలమే పుణ్యుండు ♦ గడపుచుండు
వలసి యాయువు దక్క ♦ నన్యుల యాయువు
    నుదయాస్తమయములఁ ♦ నుగ్రకరుఁడు

వంచించుకొనిపోవ ♦ వాఁడది యెఱుఁగక
జీవింతుఁ బెక్కేండ్లు ♦ సిద్ధమనుచు
నంగనాపుత్త్రికే ♦ హారామ విత్తాది
సంసార హేతుక ♦ సంగసుఖము

తే. దగిలివర్తింప గాలంబు ♦ తఱియెఱింగి
దండధరకింకరులువచ్చి ♦ తాడనములు
చేసికొనిపోవఁ బుణ్యంబు ♦ సేయనైతిఁ
బాపరతి నైతినని బిట్టు ♦ పలవరించు॥

సీ. అలరుజొంపములతో ♦ నభ్రంకషంబులై
పెరుఁగవే వనముల ♦ పాదపములు
ఖాదనమేహానఁ ♦ గాంతులఁ బశువులు
జీవింపవే గ్రామ ♦ సీమలందు
నియతిఁ ద్రిమ్మనుచ్ఛ్వాస ♦ నిశ్వాసపవనముల్
పాలింపవే చర్మ ♦ భస్త్రికలును
గ్రామసూకరశున ♦ కశ్రేణులింటింటఁ
దిరుగవే దుర్యోగ ♦ దీనవృత్తి

తే॥ నుష్ట్రఖరములు మోవవే ♦ యురుభరములఁ
బుండరీకాక్షు నెఱుఁగని ♦ పురుషపశువు
లడవులందు నిదానము ♦ లందుఁ బ్రాణ
విషయభరయాత్ర లోనుంట ♦ విఫలమధిప॥

—♦ సుయజ్ఞోపాఖ్యానము ♦—

వ.—అంత హిరణ్యకశిపుండు దుఃఖితుండై మృతుండయిన సోదరునకు నుదకప్రదానాది కార్యము లాచరించి యతనిబిడ్డల శకుని శంబర కాలనాభ మదోత్కచ ప్రముఖుల నూరడించి, వారలత

ల్లితోఁగూడ హిరణ్యాక్షు భార్యల నందఱఁ గావించి, తమతల్లి మొదలిన వలోకించి యిట్లనియె

శా॥ సీరాగారనివిష్ట పాంథులక్రియన్ ♦ విశ్వంపు సంసారసం
చారుల్ వత్తురుగూడి యిత్తురుగదా ♦ నానా బులేదొక్కచో
శూరుల్ వోయెడి స్త్రీలఁ బోయెదరు ధవ ♦ శూన్యమునఁ దల్లీమహా
శూరుం డాతఁడు తద్వియోగమునకున్ ♦ శోకింపఁ గేటికిన్.

సీ. సర్వజ్ఞుఁ డీశుండు ♦ సర్వాత్ముఁ డవ్యయుం
డమలుండు సత్యుఁడ ♦ నంతుఁ డాతఁ
డాత్మయోగంబున ♦ నశ్రాంతమును దన
మాయాప్రవర్తన ♦ మహిమవలను
గుణములఁ గల్పించి ♦ గుణసంగమంబున
లింగశరీరంబు ♦ లీలఁ దాల్చి
కంపితజలమునఁ ♦ గదలెడి క్రియఁ దోఁచు
పాదపంబుల భంగి ♦ భ్రామ్యమాణ

ఆ. చక్షువులఁ ధరిత్రి ♦ చలితయై కానంగఁ
బడినభంగి వికల ♦ భావరక్తుఁ
డాత్మమనముఁ గంపి ♦ శాంతరంగంబునఁ
గదలినట్లు తోఁచుఁ ♦ గదలకుండు.

వ॥ అవ్వా! యివ్విధమున లక్షణవంతుండుగాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందించు సంభవవినాశశోకవివేకావివేకచింతాస్మరణంబులు వివిధంబు లీయర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధుయమసంవాదంబను నితిహాసంబు నుదాహరింతురు. వినుండు చెప్పెద నుశీనరదేశంబునందు సుయజ్ఞుండను రాజుగలం డతండు శత్రువులచేత యుద్ధంబున నిహతుండయి యున్న యెడ.

సీ॥ ఒరిగిన బహురత్న ♦ విగ్రవర్మములతోడ
రాలిన భూషణా ♦ రాళితోడ
ఖరశరబాధని ♦ ర్భిన్నవక్షముతోడ
దళమగారెడు శోణి ♦ తంబుతోడ
గీర్ణమై జారిన ♦ కేశబంధముతోడ
రయరోష దష్టా ధ ♦ రంబుతోడ
భీకర శరాగ్ని ♦ ర్భిన్నవక్షముతోడ
భూరజోయుత ముఖాం ♦ బుజముతోడ

ఆ. గునిసి పడిన దీర్ఘ ♦ దోర్దండములతోడ
జీవరహితుడగు ను ♦ శీనరేంద్రుఁ
జుట్టిబంధుజనులు ♦ సొరిది నుండఁగ భయా
క్రాంతలగుచు నతని ♦ కాంతలెల్ల॥

శా॥ విస్రస్తాకంపిత కేశబంధములతో ♦ సంభిన్నహారాళితో
హస్తాబ్జంబులు వాది మోదికొనుచున్ ♦ హా నాథ యంచున్ బహు
విస్తారోక్తులతోడ నేడ్చిరి వగం ♦ బ్రాణేశు పాదంబుపై
నస్తోకస్తనకుంకుమారుణ వికీ ♦ ర్ణాస్రంబు వర్షించుచున్॥

మ॥ అనఘా! నిన్ను నుశీనర ప్రజల క ♦ త్యానందసంధాయిగా
మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత ను ♦ న్మూలించెనే వీరికిం
దనయశ్రీలకు మాకు దిక్కుగలదే ♦ ధాత్రీశ! నీ వోటికిన్
జనునే పాసి చనంగ మిత్రజనులన్ ♦ సన్మిత్రులం బుత్రులన్॥

మ॥ జనలోకేశ్వర! నిన్నుఁ బాసిన నిమే ♦ షంబుల్ మహాబ్దంబులై
చను లోకాంతర గామివై మరలకే ♦ చందంబునన్ నివ్వు పో
యిన మే మెట్లు చరింతు మొల్లము గదా ♦ యీ లోకవృత్తంబు నేఁ
డనలజ్వాలలఁ జొచ్చివచ్చెద మునీ ♦ యంఘ్రిద్వయం జాడఁగన్॥

వ—అని యిట్లు రాజభార్యలు శవంబు డగ్గఱి నిలపింపంబొద్దు

గ్రింకేతుసమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణబాల కుండై యముండు సనుదెంచి ప్రేతబంధువులఁ జూచి యిట్లనియె.

ఉ॥ మచ్చికవీరికెల్ల బహు ♦ మాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుంటఁజూచెదరు ♦ చావకమానెడువారిభంగి, నీ
చచ్చినవానికేడ్వదరు ♦ చావున కొల్లగ డాఁగవచ్చునే
మెచ్చటఁ బుట్టెనయ్యెడల ♦ కేగుటనైజము ప్రాణికోటికిన్॥

క॥ జననీజనకులఁ బాసియు
ఘనవృకముల బాధపడక ♦ కనుఁబిన్నలమై
మనియెద మవ్వఁడు గర్భం
బున మును పోషించువాఁడె ♦ పోషకుఁ డడవిన్॥

క॥ ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల
నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు ♦ నెవ్వఁడనంతుం
డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ
డివ్విధమున మనుచుఁ జెరుచు ♦ హేలారతుఁడై॥

ఆ॥ ధనము వీధిఁబడిన ♦ దైవవశంబున
నుండు బోవు యూాల ♦ నున్ననైన
నడవిరక్షలేని ♦ యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మంది ♦ రమునఁ జచ్చు॥

క॥ కలుగును మృతిలేకుండును
గలభూతములెల్లఁ గాల ♦ కర్మవశములై
నిలువఁబడుఁ బ్రకృతిఁ దద్గుణ
కలితుఁడు వాఁడాత్మమయుఁడు ♦ గమ్యుఁడు తలఁపన్॥

సీ॥ పాంచభౌతికమైన ♦ భవనంబు దేహంబు
పురుషుండు దీనిలోఁ ♦ బూర్వకర్మ

వశమున నొకవేళ ♦ వర్తించు దీపించుఁ
దఱియైన నొకవేళ ♦ దలఁగిపోవు
జెడనేని దేహంబు ♦ సెడుగాని పురుషుండు
సెడఁడాతనికి నింత ♦ సేటు లేదు
పురుషునికిని దేహ ♦ పుంజంబునకు వేఱు
గాని యేకత్వంబు ♦ గానరాదు

ఆ॥ దారువుల వెలుంగు ♦ దహనుని కైవడి
గాయములఁ జరించు ♦ గాలిభంగి
నాకలీనమైన నభము ♦ చాడ్పున వేఱు
తెలియవలయు దేహి ♦ దేహములకు॥

వ— అని మఱియు నిట్లనియె॥

సీ॥ భూపాలకుఁడు నిద్ర ♦ వోయెడినుండేమి
విలపింప నేటికి ♦ వెఱ్ఱులార
యెవ్వఁడు భాషించు ♦ నెవ్వఁడాకర్ణించు
నట్టివాఁ డెన్నఁడో ♦ యరిగినాఁడు
ప్రాణభూతుండైన ♦ పవనుఁ డాకర్ణింప
భాషింప నేరఁడు ♦ ప్రాణి దేహ
ములకు వేఱైతాన ♦ ముఖ్యుఁడై యింద్రియ
వంతుఁడై జీవుండు ♦ వలనుమెఱయుఁ

ఆ॥ బ్రాభవమున భూత ♦ పంచకేంద్రియమనో
లింగదేహములను ♦ లీలఁగూడు
విడుచు నన్యుఁ డొకండు ♦ విభుఁడు దీనికి మారు
వాగులనేల వగల ♦ వారలనేల॥

క॥ ఎందాఁక నాత్మ దేహము
నొందెడు నందాఁక కర్మ ♦ యోగములట పైఁ

జెందవు మాయాయోగ
స్పందితులైరి తజ్జాలిఁ ♦ బడ నేమిటికిన్ ।

మ. చెలులుం దల్లులు దండ్రులాత్మజులు సం ♦ సేవ్యుల్ సతుల్ చారుని
ర్మల గేహంబులటం చుఁ గూర్తురు మహా ♦ మాయాగుణ భ్రాంతులై
కలలోఁ జోచిన యోగములే నిజములే ♦ కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక పాసుఁ బిదపం ♦ గర్మాంత కాలంబునన్ ।

వ॥ మఱియు మాయాగుణ ప్రపంచంబు నెఱింగిన తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖదుఃఖంబులం జెంద రజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు. తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతకభూతుండైన యెఱుకు గలం డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటంబైన వేట తమకంబున,

క. వలలురులు జిగురుఁగండెలు
జలిదియుఁ జిక్కంబు ధనువు ♦ శరములుఁ గొనుచుం
బులుగులఁ బట్టెడు వేడుక
యలుఁగులు వెడలంగఁ గదలి ♦ యడవికి జనియెన్ ।

వ. మఱియు నానావిధంబులగు శకుంతంబుల నంతంబు నొందించుచు సకలపక్షిసంహారలబ్ధకుండైన లుబ్ధకుండు తనముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కులింగపక్షిమిథునంబుఁ గనుంగొని యందుఁ గులింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులోఁ వైచినం జూచి దుఃఖించి కులింగపక్షి యిట్లనియె॥

చ॥ అడవుల మేఁత మేసి మన ♦ మన్యుల కెన్నఁడు నెగ్గుసేయము ।
క్కడ విహరింప నేఁడకట ♦ కట్టడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ
బడుమని వ్రాసెనే నుదుటఁ ♦ బాపము దైవముకంటె నింత యొ
క్కడు బరువయ్యెనే బ్రదుకు ♦ గోమలి యేమన నేర్తుఁ జెల్లరే॥

క. ఒకమాటు మనలనందఱఁ
బ్రకటించి కిరాతువలల ♦ బడఁజేయఁగ వి
న్నకతెన్ వలఁబడఁజేసిన
వికలీకృతదక్షుమైన ♦ విధి నేమందుర్.

ఉ. తెక్కలు రావు పిల్లలకు ♦ వటనుండియు మేఁతగానమిం
బొక్కెడు గూటిలో నెగసి ♦ పోవఁగ నేరవు మున్ను తల్లియా
దిక్కున నుండి వచ్చునని ♦ త్రిప్పుని మూఱ్కల నిక్కినిక్కి స
ల్దిక్కులఁ జూచుచున్నవి ♦ దీనత నెట్లు భరింతునక్కటా!

వ.—అని యివ్విధంబున

క. కుంతితివాదముఁ జోడను
గంతము శోషింపవగచు ♦ ఖగమును వాసనో
త్కంతుండై నకిరాతుఁడ
కుంతిగతి జేసెనొక్క ♦ కోలంగూలన్.

క. కాలము వచ్చిన తఱిఁ బరుని
కోలను ధరఁగూలె ఖగము ♦ ఘోషము చోడం
గాలము డాసిన నేలం
గూలక పోవతెము యెట్టి ♦ గుణవంతులకున్.

ఉ. కావున మీరు చచ్చుతఱిఁ ♦ గానరు చచ్చి ధరిత్రిఁ బడ్డధా
త్రీవిభుదేహముం గదిసి ♦ దీనత నేడువనేల పొంపు, చిం
తావతులార! వత్సరశ ♦ తంబులకైనని జేసుచక్కఁ గిం
బోవుట దుర్లభంబు మృతిఁ ♦ బొందినవారలు సేరవత్తురే!

వ.—అనియిట్లు కపటబాలకుండై క్రీడించుచున్న యముని యుపలాపహాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబుగాదని తలంచి శోకించక సుయజ్ఞునికిసాంపరాయికకృత్యంబులు సేసిచనిరి.

—( హిరణ్యకశిపుండు బ్రహ్మను గోరినవరములు. )—

శా. గాలింగుంభిని నగ్నినంబువుల నా ♦ కాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములందమఃప్రభల భూ ♦ రిగ్రామరక్షో మృగ
వ్యాళాదిత్య నరాది జంతుకలహ ♦ వ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లో ♦ కాధీశ! యిప్పింపవే!

-హిరణ్యకశిపునివలనభయమందిన దేవతలకు శ్రీహరి యభయమిచ్చుట.-

మ. భయముం జెందకుఁడయ్య నిర్జరవరుల్ ♦ భద్రంబు మీ కయ్యెడున్
జయమున్ లాభము భూతసంతతికి మ ♦ త్సందర్శనప్రాప్తిని
వ్యయమై చేరు నెఱుంగుఁగున్ దితిసుత ♦ వ్యాపారభావానివ
ర్త్యయముల్ గాలము గూడఁ జంపెదఁ జనుం ♦ డంబాక మీరాశ్రీవలన్॥

ఆ. శుద్ధసాధువులందు ♦ సురలందు శ్రుతులందు
గోవులందు విప్ర ♦ కోటియందు
ధర్మపదవియందు ♦ దగిలి నాయందు వాఁ
డెప్పుడలుగు వాఁడె ♦ హింసనొందు.

కం. కన్నకొడుకు శమదమసం
పన్నుఁడు నిర్వైరుఁడౌ ♦ ప్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా
పన్నత నొందించువాఁడె ♦ పట్టివధింతున్॥

శా. వేధోదత్తవర ప్రసాదగరిమన్ ♦ వీఁడింత వాఁడై మిముం
బాధం బెట్టుచునున్న వాఁడని మదిన్ ♦ భావింతు, భావించినన్
సాధింపందగుఁగాదు గావునఁ గడున్ ♦ సైరించితిన్ మీఁదటన్
సాధింతున్ సురలార! నేఁడు సనుఁడా ♦ శంకింప మీ కేటికిన్॥

—ప్రహ్లాదచరిత్రము—

సీ. తనయందు నఖిలభూ ♦ తములందు నేకభంగి
సమహితత్వంబున ♦ జరుగువాఁడు

పెద్దలఁ బొడఁగన్న ♦ భృత్యునికైవడి
చేరి నమస్కృతుల్ ♦ సేయువాఁడు
కన్నుదోయికి నన్య ♦ కాంతలడ్డంబైన
మాతృభావన సేసి ♦ మరలువాఁడు
తల్లిదండ్రుల భంగి ♦ ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జిం ♦ తించువాఁడు

తే. సములయెడ సోదరస్థితి ♦ జరపువాఁడు
దైవతములంచు గురువులఁ ♦ దలఁచువాఁడు
లీలలందును బొంకులు ♦ లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్ర ♦ హ్లాదుఁడధిప॥

వ.—మఱియును,

సీ. ఆకారజన్మవి ♦ ద్యార్థవరిష్ఠుఁడై
గర్వసంస్తంభనం ♦ గతుఁడుగాఁడు
వివిధమహాశ్రీల ♦ విషయసంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ ♦ బట్టువడఁడు
భవ్యవయోబల ♦ ప్రాభవోపేతుఁడై
కామరోషాదులఁ ♦ గ్రందుకొనఁడు
కామినీప్రముఖభో ♦ గములెన్ని గలిగిన
వ్యసనసంసక్తి నా ♦ వంకఁ బోఁడు

ఆ. విశ్వమందుఁగన్న ♦ విన్నయర్థములందు
వస్తుదృష్టిఁ జేసి ♦ వాంఛయిడఁడు
ధరణినాథ! దైత్య ♦ తనయుండు హరిపర
తంత్రుఁడై మహాత్మ్య ♦ తంత్రుఁడగుచు॥

ఆ. సద్గుణంబులెల్ల ♦ సంఘంబులై వచ్చి
యసురరాజతనయు ♦ నందునిలిచి

పాసిచనవు విష్ణుఁ ♦ బాయని విధమున
నేను దగిలియుందు ♦ నిర్మలాత్మ!

మ. తగవారైన సురేంద్రులున్ సభలలోఁ ♦ బ్రహ్లాదసంకాశులన్
సుగుణోపేతుల నెందు నేము గనముం ♦ సువృత్తబంధంబులన్
బొగడం జొత్తురు సత్కవీంద్రులు కిరీటుల్ ♦ భూనాథ! మీలోన స
ద్భగవద్భక్తులు దైత్యరాజతనయుం ♦ బాటించి కీర్తింపఁగే॥

కం. గుణనిధియగు ప్రహ్లాదుని
గుణములనేకములు గలవు ♦ గురుకాలమునన్
గణుతింపనశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని ♦ భాషాపతికిన్॥

వ॥ ఇట్లు సద్గుణగరిష్ఠుండయిన ప్రహ్లాదుండు భగవంతుండయిన వాసుదేవునియందు సహజసంవర్ధమాననిరంతరధ్యానపరతుండై.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ ♦ జేరినయట్లైనఁ
జెలి గాంచి నవ్వుఁ ♦ జేరమఱచు
నసురారి దనమ్రోల ♦ నాడినయట్లైన
నసురబాలురతోడ ♦ నాడమఱచు
భక్తవత్సలుఁడు సం ♦ భాషించినట్లైనఁ
బరభాషలకు మాఱు ♦ పలుకమఱచు
జగద్వంద్యుఁ దనలోనఁ ♦ జూచినయట్లైనఁ
జొక్కి సమస్తంబుఁ ♦ జూడమఱచు

తే. హరిపదాంభోజయుగచింత ♦ నామృతమున
నంతరంగంబు నిండిన ♦ ట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు న ♦ న్నియును మఱచి
జడత లేక యుండును ♦ జడుని భంగి॥

శా. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ ♦ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ ♦ రక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీ ♦ చింతామృతస్వాదనం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే ♦ తద్విశ్వమున్ భూవరా॥

సీ. వైకుంఠ చింతాప ♦ వర్జితచేష్టుఁడై
యొక్కఁడు నేడుచు ♦ నొక్కచోట
నశ్రాంతహరిభావ ♦ నారూఢచిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు ♦ నొక్కచోట
విష్ణుఁడింతయుఁ గాని ♦ వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు ♦ నొక్కచోట

ఆ. బలుకు నొక్కచోటఁ ♦ బరమేశుఁ గీర్తించు
బ్రణయ హర్షజనిత ♦ బాష్పసలిల
మిళితపులకుఁడై ని ♦ మీలితనేత్రుఁడై
యొక్కచోట నిలిచి ♦ యూరకుండు॥

వ॥ ఇట్లు పూర్వజన్మపరమభాగవతసంసర్గసమాగతంబైన ముకుందచరణారవిందసేవాతిరేకంబున ఖర్వనిర్వాణభావంబు విస్తరించుచున్న పుత్రునప్పటికి దుర్జనసంసర్గనిమిత్తంబునం దనచిత్తంబు నన్యాయత్తంబుగా నీక నిజాయత్తంబు సేయుచు నపరిమితుండును, సంసారనివృత్తుండును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణిగణాగరిష్ఠుండును, బరమభాగవతశ్రేష్ఠుండును, కర్మబంధలతాలవిత్రుండును, బవిత్రుండును నైన పుత్రునియందు విరోధించి సురవిరోధి యనుకంప లేక చంపం బంపెనని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె॥

శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ ♦ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధిసెప్పి దురితో ♦ న్మేషంబు వారింతురే

శత్రుత్వంబుదలంక రిట్టిదొడవా ♦ సౌజన్యరత్నాకరుం
బుత్రుం లోకపవిత్రుఁ దండ్రి నగుచుం ♦ బోధింప నెట్లోర్చెనో॥

ఉ. బాలుఁ బ్రభావిశాలు హరి ♦ పాదపయోరుహచింతనక్రియా
లోలుఁ గృపాళు సాధుగుణు ♦ లోకవదాన్యతపాలు నిర్మల
శీలు సమస్తసభ్యనుత ♦ శీలు విఖండిత మోహవల్లికా
జాలు నదేల తండ్రి వడిఁ ♦ జంపఁగఁ బంపె మునీంద్ర! చెప్పవే॥

అనిన నారదుండిట్లనియె.

శా॥ లభ్యంబైన సురారిరాజపదముల్ ♦ లక్షింపఁ డశ్రాంతముల్
సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై ♦ జాడ్యంబుతోఁ బెంచు వి
ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతిగా ♦ దంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునన్ బ్రియసుతున్ ♦ వీక్షించి నిత్యాంగుఁడై॥

కం. చదువనివాఁడజ్ఞుండగు
జదివిన సదసద్వివేక ♦ చతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ ♦ జదువుము తండ్రీ॥

వ—అని పలికి యసురలోకపురోహితుండును, భగవంతుఁడును నయిన శు
క్రాచార్యుకొడుకులఁ బ్రచండ వితర్కులఁ జండామార్కుల
రావించి సత్కరించి యిట్లనియె॥

శా. అంధప్రక్రియనున్నవాఁడు పలుకం ♦ డస్మత్ప్రతాపక్రియా
గంధంబించుక లేదు మీరు గురువుల్ ♦ గారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం ♦ బాటించి యీ బాలకున్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం ♦ గావించి రక్షింపరే॥

వ—అని పలికి వారలకుఁ బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొండనిన
వారును దనుజకుమారునిం గొనిపోయి యతనికి సమవయస్కు
లగు సహశ్రోత్రుల నసురకుమారులం గొందఱంగూర్చి॥

ఉ. అంచితభక్తితోడ దను ♦ జాధిపగేహసమీపమునం బ్రవే
శించి సురారిరాజసుతుఁ ♦ జేకొని శుక్రకుమారకుల్ పఠిం
పించిరి పాఠయోగ్యములు ♦ పెక్కులుశాస్త్రము లాకుమారుఁడా
లించి పఠించెనన్నియుఁ జ ♦ లింపని విష్ణుపదభక్తిపూర్ణుఁడై॥

కం. ఏపగిదివారు సెప్పిన
నాపగిదిం జదువుఁగాని ♦ యట్టిట్టని యా
క్షేపింపఁడు దానన్నియు
రూపించిన మిథ్యలని ని ♦ రూఢమనీషన్॥

శా. అంతం గొన్నిదినంబు లేఁగినను రేం ♦ ద్రారాతిశంకాన్విత
స్వాంతుండై నిజనందనుం గురువులే ♦ జాడం బఠింపించిరో
భ్రాంతుండేమి పఠించెనో పిలిచి సం ♦ భాషించి విద్యాపరి
శ్రాంతిం జూచెదఁగాక నేఁడని మహా ♦ సౌధాంతరాసీనుఁడై॥

ఉ. మోదముతోడ దైత్యకుల ♦ ముఖ్యుఁడు రమ్మని చీరఁబంచెఁ బ్ర
హ్లాదకుమారకుం భవమ ♦ హార్ణవతారకుఁ గామరోషలో
భాదివిరోధివర్గపరి ♦ హారకు నీశపదాంతనామృతా
స్వాదరతోరకుం గలుష ♦ జాలమహాగ్రవనీకుఠారకున్॥

వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు సను
దెంచిన.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమై ♦ యుద్యోగమారాధనం
బిత్సంబన్నుఁడవైతివే చదివితే ♦ వేదంబులున్ శాస్త్రముల్
వత్సా! రమ్మని చేరఁజీరి కొడుకున్ ♦ వాత్సల్యసంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం ♦ డుత్కంఠ దీపింపఁగన్॥

క॥ అనుదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖ ♦ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ ♦ సద్భూషణముల్॥

వ—అని మఱియుం బుత్రా! నీకిట్టి ద్వైతభావంబై యున్నది. నిప్పామ
నినుఁగన్నతండ్రికిఁ బ్రియానందనుం డిట్లనియె॥

ఉ. ఎల్లశరీరధారులకు ♦ నిల్లను చీఁకటినూతిలోపలం
ద్రెళ్లక మీరు మేమనుమ ♦ తిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్ సతత ♦ దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లము చేర్చి తారడవి ♦ నుండుట మేలు నిశాచరాగ్రణీ॥

వ—అని కుమారకుండాడిన ప్రతిపక్షోను రూపంబులయిన వల్లా
పంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె॥

క. ఎట్టాడిన నట్టాడుదు
రిట్టట్టని పలుకనేఱుఁగ ♦ రితరుల శిశువుల్
పట్టించి యెవ్వరేనిని
పట్టించిరో బాలకునకుఁ ♦ బరపక్షంబుల్.

శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁగదా ♦ నాతండ్రి యీబుద్ధిదా
నికున్ లోపలఁ దోఁచెనో పరులచే ♦ క్షితుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో ♦ యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ ♦ వర్ణింపనేటికిన్॥

మ. సురబృందంబులటయో సురాధిపతులన్ ♦ సొక్కించుటో సిద్ధులం
బరివేధించుటయో మునిప్రవరులన్ ♦ బాధించుటో యక్షకి
న్నరగంధర్వవిహంగనాగపతులన్ ♦ నాశంబు నొందించుటో
హరియించున్ గిరియించు నేల చెడ మా ♦ హాంధుండ వైపుత్రకా॥

వ—అనిన దండ్రిమాటలకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుండి
ట్లనియె. మోహనిర్మూలనంబు సేసి యెవ్వనియందుఁ దత్పరు
లయి యెఱుకగలపురుషులు కుంబరులు దారని యెదుమాయాశ్వ
తంబయిన యనర్గ్రాహ్యంబుగానంబడ దట్టి పరమేశ్వరునకు నమ
స్కరించెద.

శా. అజ్ఞుల్ గొందఱు నేము దారనుచు మా ♦ యం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలబ్ధమదస్వయత్క్రియములుల్ ♦ భావింపఁగా నేరరా
జజ్ఞానావదమందు మూఢులుగదా ♦ చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ ♦ దర్శింపఁగా నేర్తురే॥

తే. ఇనుమయస్కాంతసన్నిధి ♦ నెట్లు భ్రాంత
మగు స్వామీ కేశుసన్నిధి ♦ నావిధమున
గరఁగుచున్నది దైవయో ♦ గమునఁ జేసి
బ్రాహ్మణోత్తమచిత్తంబు ♦ భ్రాంతమగుచు॥

సీ. మందారమకరంద ♦ మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే ♦ మదనములకు
నిర్మలమందాకి ♦ నీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె త ♦ రంగిణులకు
లలితరసాలప ♦ ల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే ♦ కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికా ♦ స్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీ ♦ హారములకు

తే. నంబుజోదరదివ్యపా ♦ దారవింద
చింతనామృతపానవి ♦ శేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ ♦ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు ♦ వేయునేల॥

వ. అనిన విని రోషించి, రాజసేవకుండైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్లనియె.

ఉ. పంచశరద్వయస్కుఁడవు ♦ బాలుఁడవిందుకగాని లేవు భా
షించెదు తర్కవాక్యములు ♦ సెప్పినశాస్త్రములోని యర్థము

క్రించుకరైనఁ జెప్ప వసు ♦ రేంద్రునిముందట మాకు నాదలం
వంచుకొనంగఁ జేసితిరి ♦ వైరివిభూషణ! వంశదూషణా!

చ. తనయుఁడుగాఁడు శాత్రవుఁడు ♦ దానవభర్తకు వీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయు ♦ తక్షితిజాతము భంగిఁబుట్టినాఁ
డనవరతంబు రాక్షసకు ♦ లాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁగాని శిక్షలకు ♦ డాయఁడు కట్టుఁడు కొట్టుఁడుద్ధతిన్॥

క. ఈ పాపనిఁ జదివింతుము
నీపాదములాన యింక ♦ నిపుణతతోడం
గోపింతుము దండింతుము
కోపింపకుమయ్య దనుజ ♦ కుంజర వింటే॥

వ. అని మఱియు నారాచపాపనికి వివిధోపాయంబులఁ బు
రోహితుఁడు వెఱపుఁజూపుచు రాజసన్నిధిం బాసి గొనికొనిపోయి
యేకాంతంబున.

క. భార్గవనందనుఁ డతనికి
మార్గము నెఱుకుండఁ జెప్పె ♦ మాటలు పెచ్చుల్
వర్గత్రితయము సెప్పె న
వర్గము మతివిశేష ♦ మమర నరేంద్రా॥

వ. మఱియు గురుఁడు శిష్యునకు సామదానభేదదండోపాయం
బులన్నియు నెఱింగించి నీతికోవిదుండయ్యెనని నమ్మి నిశ్చయించి తల్లికి
నెఱింగించి తల్లిచేత నలంకృతుండయిన కులదీపకు నవలోకించి,

ఉ. త్రిప్పకుమన్న మామతము ♦ దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకుమన్న నేఁడు మన ♦ దైత్యవరేణ్యుని మ్రోల నేమియున్
జెప్పిన నీతిఁగాని మఱి ♦ చెప్పకుమన్న విరోధిశాస్త్రముల్
విప్పకుమన్న దుష్టమగు ♦ విష్ణుచరిత్రకథార్థజాలముల్॥

వ. అని బుజ్జగించి దానవేశ్వరుసన్నిధికిం దోడి తెచ్చిన,

సీ. అడుగద్గునకు బాధ ♦ వానుచింతన సుధా
మాధుర్యమున మేను ♦ మఱచువాని
సంభోజగర్భుడు ♦ లభ్యసింపఁగ లేని
హరిభక్తి పుంభావ ♦ మైనవాని
మాతృగర్భమునాఁడె ♦ మున్న పొందలుగాఁ
జిత్తమచ్యుతుమీఁదఁ ♦ జేర్చువాని
సంకించి తనలోన ♦ నఖిలప్రపంచంబు
శ్రీవిష్ణుమయమని ♦ తెలఁగువాని

తే. గీ. వినయకారుణ్యబుద్ధిని ♦ వేకలతఁ
నాతిగుణముల కాటప ♦ ట్టయినవాని
శిష్యబుధలోకసంభావ్యుఁ ♦ జేరి గురుఁడు
ముందటికిఁ దోడ్చి తండ్రికి ♦ మ్రొక్కఁజేసె॥

క. శిక్షించితి మాన్యములగు
శక్షంబులుమాని నీతి ♦ పారఁగుఁడయ్యెన్
రక్షోవంశాధీశ్వర !
వీక్షింపుము నీకుమారు ♦ విద్యాబలముల్ ॥

వ. అనిపలికిన శుక్రకుమారకు వచనము లాకర్ణించి దానవేం ద్రుఁడు దనకు దండప్రణామంబు జేసినిలుచున్న కొడుకును దీవించి బాహుదండంబు సాచి దిగ్గనం దగ్గఱం దిగిచి గాఢాలింగనంబు సేసి తన తొడలమీఁద నిడికొని సంచుమఱి చుబుకంబు బుడికి చెక్కిలిముద్దు గొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేకసంజనిత బాష్పబిందుసందో హంబుల నతని వదనారవిందంబు దడుపుచు మందమధురాలాపంబుల నిట్లనియె॥

శా. చోద్యంబయ్యెడి నింత కాలము మఱిన్ ♦ శోధించి యేమేమి సం
వేద్యార్థంబులు సెప్పిరో గురువు లే ♦ వెంటన్ వితర్కించిరో
విద్యాసారము లెల్లఁ గోరెద భవ ♦ ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొక్కటిసెప్పి సార్థముగ దా ♦ త్పర్యంబు భాషింపుమా॥

శా. నిన్నుం జెప్పరు నీతిపాఠమహిమన్ ♦ నీగోడ దైత్యార్భకుల్
గన్నారన్నియుఁ జెప్ప నేర్తురుగదా ♦ గ్రంథార్థముల్ దక్షులై
యున్నారొక్కొఁ దనీవు నీతివిదుఁడౌ ♦ దంచున్ మహావాంఛతో
నున్నాఁడన్ ననుఁగన్నతండ్రి భవదీ ♦ యోత్కర్ష మింజూపవే॥

వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య ♦ శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ ♦ జదివితిఁ దండ్రీ॥

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ ♦ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ ♦ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల స ♦ ర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ ♦ సత్యంబు దైత్యోత్తమా॥

శా. అంధేందూదయముల్ మహాబధిరశం ♦ ఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూ ♦ కాంతల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లు ♦ బ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గ్రంథంబుల్ హరిభక్తివర్జితుల రి ♦ క్తవ్యర్థసంసారముల్॥

సీ. కమలాక్షు నర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ♦ జిహ్వ జిహ్వ

సురరక్షకునిఁజూచు ◆ చూడ్కులుచూడ్కులు
శేషశాయికిఁ మ్రొక్కు ◆ శిరముశిరము
విష్ణునాకర్ణించు ◆ వీనులువీనులు
మధువైరిఁదవిలిన ◆ మనముమనము
భగవంతువలఁగొను ◆ పదములుపదములు
పురుషోత్తమునిమీఁది ◆ బుద్ధిబుద్ధి
తే. దేవదేవునిఁజింతించు ◆ దినముదినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువుచదువు
కుంభినీధవుఁ జెప్పెడి ◆ గురుఁడుగురుఁడు
తండ్రి! హరిఁజేరుమనియెడి ◆ తండ్రితండ్రి॥
సీ. కంజాక్షునకుఁగాని ◆ కాయంబు కాయమే,
పవనగుంభితచర్మ ◆ భస్త్రిగాక
వైకుంఠుఁబొగడని ◆ వక్త్రంబువక్త్రమే
ఢమఢమధ్వనితోడి ◆ ఢక్కగాక
హరిపూజనములేని ◆ హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మిత ◆ దర్విగాక
కమలేశుఁజూడని ◆ కన్నులుకన్నులే
తనుకుడ్యజాలరం ◆ ధ్రములుగాక
ఆ. చక్రిచింతనలేని ◆ జన్మంబుజన్మమే
తరళసలిల బుద్బు ◆ దంబుగాక
విష్ణుభక్తిలేనివిబుధుండు ◆ విబుధుఁడే
పాదయుగముతోడి ◆ పశువుగాక॥
సీ॥ సంసారజీమూత ◆ సంఘంబువిచ్చునే
చక్రిదాస్యప్రభం ◆ జనములేక
తాపత్రయాభీల ◆ దావాగ్నులాఱునే
విష్ణుసేవామృత ◆ వృష్టిలేక

సర్వాంకషాఘౌఘసు ♦ జలరాసులింకునే
హరిమనీషాబడ ♦ బాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధ ♦ కారంబులడఁగునే
పద్మాక్షునుతిరవి ♦ ప్రభలు లేక

తే॥ నిరుప మాపునరావృత్తి ♦ నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ♦ ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాం ♦ జనము లేక
తామరస గర్భునకునైన ♦ దానవేంద్ర.

వ॥ అనియివ్విధంబున వెఱపుమఱపు నెఱుంగక యాలుకుసెడి పలికెడి కొడుకునప్పలుకులు చెవులకు ములుకులక్రియ నొదవిన పెదవు లదరంగ నురుచు నదరిపడి గురుసుతునిం గనుంగొని విమతకథనంబులు గఱపినాఁడవని దానవేంద్రుండిట్లనియె.

చ॥ పటుతరనీతిశాస్త్రచయ ♦ పారగుఁ జేసెదనంచు బాలునీ
వటుగొనిపోయి వానికి న ♦ నర్థములైనవిరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృ ♦ గుప్రవరుండ వటంచునమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతివి ♦ గాకయథార్థపు బ్రాహ్మణుండవే॥

క॥ ధర్మేతరవర్తనులును
దుర్మంత్రులునైనజనుల ♦ దురితములొందున్
మర్మజ్ఞులు గలఁచికల్మష
కర్మలరోగములు నొందు ♦ కైవడివిప్రా॥

వ॥ అనినరాజునకుఁ బురోహితుఁ డిట్లనియె.

ఉ॥ తప్పులు లేవుమావలన ♦ దానవనాథ! విరోధశాస్త్రముల్
చెప్పము క్రూరులైవరులు ♦ చెప్పరు మీచరణంబులాన ను

మ్మున్నవ్వుచు మీరుమీరునకు ♦ నింతయు నైజమునీవ యెవ్వరుం
జెప్పెడిపాటిగాదు పరికించితెఁ ♦ దాంపుడు నేర్పరై వడిన్।

క॥ మిత్రులము పురోహితులము
పాత్రులమే మదియుఁగాక ♦ భార్గవులము నీ
పుత్రునినిటువలెఁ జేయఁగ
శత్రులమే దైత్యజలధి ♦ చంద్రమ వింటే।

వ॥ అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు కొడుకు నవలోకించి యిట్లనియె.

క॥ ఒజ్జలుసెప్పని యీమతి
మజ్జాతుఁడవైన నీకు ♦ మఱియెవ్వరిచే
నుజ్జ్వలమయ్యెఁ బాలక
తజ్జనులం జేరుకొనుము ♦ తగ నామ్రోలన్॥

వ॥ అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుఁ డిట్లనియె॥

ఉ॥ అచ్చపు జీకటింబడి గృ ♦ హవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ ♦ జర్వితచర్వణులైన వారికిం
జెచ్చెర పుట్టునే మతులు ♦ సెప్పిననైన నిశేచ్ఛనైననే
మిచ్చిననైనఁ గానలకు ♦ నేఁగిననైన హరిప్రబోధముల్॥

ఉ॥ కానని వానినూతఁగొని ♦ కానని వాఁడు విశిష్టవస్తువుల్
గానని భంగిఁ గర్మములఁ ♦ గైకొని కొందఱు గర్మబద్ధులై
కానరు విష్ణుఁగొందఱటఁ ♦ గందురకించన వైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తులగు ♦ సంహృతకర్ములు దానవేశ్వరా॥

శా॥ శోధింపంబడు సర్వశాస్త్రములుర ♦ శ్రీనాథ! వేయేటికిన్
గాథల్ మాధవ కీర్తితరణిసాం ♦ గత్యంబునం గాక దు
ర్మేధల్ దాటగవచ్చునే నుతవధూ ♦ మీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాలసంసృతి మహా ♦ ఘోరామితాంభోనిధిన్

వ॥ అనిపలికిన కొడుకును ధిక్కరించి మఱియు వసేయక రక్కసుల జేరుదనతొడలపైనుండనీక గొబ్బునదిగఁద్రొబ్బి నిబ్బరంబులగు కోపతాపంబులు దీపింప వేఁడిచూపుల మింటముంటలెగయ మంత్రులం జూచి యిట్లనియె.

శా. క్రోడంబైపినతండ్రిఁజంపెనని తాఁ ♦ గ్రోధించి చిత్తంబులోఁ
బ్రీడంజేయఁడు బంటుభంగి హరికిన్ ♦ విద్వేషికిన్ భక్తుఁడై
యీడండక్కట ప్రాణవాయువులు వీఁ ♦ డొప్పించుచున్నాఁడు నా
తోడన్ వైరమువట్టె నిట్టిజనక ♦ ద్రోహిన్ మహిం గంటిరే।

వ॥ అనిరాక్షసవీరుల నీక్షించి యిట్లనియె.

శా. కంచాబ్జంబులవాఁడు తండ్రినగునా ♦ పక్షంబు నిందించి యు
త్కంచిద్భీతియు లేక విష్ణునహితుం ♦ గీర్తించుచున్వాఁడు వ
లంచుం జెప్పిన మానఁ డంగమునఁ బు ♦ త్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీనివధించిరండు దనుజుల్ ♦ మీ మీపటుత్వంబులన్॥

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దు ♦ ష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ ని ♦ య్యజ్ఞుం గులద్రోహి దు
ష్టాంగుం గేశవపక్షపాతి నధముం ♦ జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదన్ గులము ని ♦ ర్దోషంబు గావించెదన్॥

క. శాంతవ్యుఁడు రక్షింపను
మంతవ్యుఁడు గాడు యముని ♦ మందిరమునకున్
గంతవ్యుఁడు వధమునకును
రంతవ్యుం డనకచంపి ♦ రండీవడుగున్।

వ. అ దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలుగలరక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని, యుబ్బి బొబ్బలిడుచు ధూమసహిత దావదహనంబునుం బోలెఁ దామ్రసంకాశంబులయిన కేశంబులు మెఱయ భేదనవాదనచ్ఛేదనంబులు సేయుచు,

ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృ ♦ పాళుఁడు సాధుఁడు లోకమాన్యసం
శీలుఁడు వీఁ డవధ్యుఁడని ♦ చిక్కకస్రుక్కక క్రూరచిత్తులై

శూలములం దదంగముల ♦ నుస్థిరులై ప్రహరించిరుగ్రవా
చాలతనందఱున్ దివిజ ♦ శత్రుఁడు వల్లనఁదయ్యె భూవరా॥

చ. పలువురు దానవుల్ పొడువ ♦ బాలునిదేహము లేశమాత్రయున్
నలియదు లోపలన్ రుధిర ♦ మబ్బదు కందదు శల్యసంఘముల్
నలియదు దృష్టిపై భవము ♦ నష్టముగాదు ముఖేందు కాంతియున్
బొలియదు నూతనశ్రమము ♦ పుట్టదు మోమున దీనభావమున్॥

ఉ. తన్ను నిశాచరుల్ పొడువ ♦ దైత్యకుమారుఁడు మాటిమాటికిన్
పన్నగశాయి! యోదనుజ ♦ భంజన! యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిల ♦ పావన! యంచు నుతించుఁగాని, తాఁ
గన్నులనీరు దేఁడు భయ ♦ కంపనమేతుఁడుగాఁడు భూవరా॥

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు ♦ బాహువులొడ్డఁడు బంధురాజిలోఁ
దూఱఁడు ఘోరకృత్యమని ♦ దూఱఁడు తండ్రిని మిత్రవర్గమున్
జేరఁడు మాతృసంఘము ప ♦ సించుసువర్ణగృహాంబులోనికిన్
దాఱఁడు కావరేయనఁడు ♦ తాపము నొందఁడు కంటగింపడున్॥

వ. ఇట్లు సర్వాత్మకంబై యిట్టిదట్టిదని నిర్దేశింపరాని పరబ్ర
హ్మంబు దానయై, యమ్మహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మయుండ
యి పరమానందంబునం బొందియున్న ప్రహ్లాదునియందు రాక్షసేం
ద్రుండు తనకింకరులచేత జేయించుచున్న మారణకర్మంబులు పాపక
ర్మునియందుఁ బ్రయుక్తంబులయిన సత్కారంబులుంబోలె విఫలంబు
లగుటం జూచి,

ఉ. శూలములన్ నిశాచరులు ♦ సుక్రక్కర దేహము నిగ్రహింపఁగా
కూలఁడు నేలపైఁ బడఁడు ♦ పాఱఁడు చావఁడు తండ్రినైననా
పాలికివచ్చి చక్రధరు ♦ భక్తిమమానితినంచుఁ బాదముల్
ఫాలముసోక మ్రొక్కఁడన ♦ పాయతనొందుట కేమిహేతువో॥

వ. అని శంకించుచు,

సీ. ఒకమాటు దిక్కుంభి ♦ యూథంబుఁ దెప్పించి
కెరలి డింభకుని ద్రొ ♦ క్కింపఁ బంపు
నొకమాటు విషభీక ♦ రోరగ శ్రేణుల
గడువడి సర్పకుఁ ♦ గఱవఁబంపు
నొకమాటు హేతిసం ♦ ఘోరాగ్నినలములోన
వెసరి కుమారుని ♦ వ్రేయఁబంపు
నొకమాటు కూలంక ♦ షోల్లోల జలధిలో
మొత్తించి బాలకు ♦ ముంచఁబంపు

ఆ. విషముఁబెట్టఁ బంపు ♦ పదలింపఁగాఁ బంపు
దొడ్డకొండచఱులఁ ♦ ద్రోయఁబంపు
బట్టికట్టఁ బంపు ♦ బాధింపఁగాఁ బంపు
బాలుఁగినిసి దనుజ ♦ పాలుఁడఘుఁడు।

సీ. ఒకవేళ సభిచార ♦ హోమంబు సేయించు
నొకవేళ నెండల ♦ నుండఁబంచు
నొకవేళ వానల ♦ నుపహతి నొందించు
నొకవేళ రంధ్రంబు ♦ లుక్కఁబట్టు
నొకవేళఁ దనమాయ ♦ నొదవించి బెగడించు
నొకవేళ మంచున ♦ నొంటినిలుపు
నొకవేళఁ జెనుగాలి ♦ కున్ముఖుఁ గావించు
నొకవేళఁ బాతించు ♦ నుర్వియందు।

తే. నీరుసన్నంబు నిడనీక ♦ నిగ్రహించు
గళలపడిపించు ఉవ్వించు ♦ గండశిలలు
గదలవ్రేయించు సేయించు ♦ ఘనశరముల
గొడుకు నొకవేళ నమరారి ♦ క్రోధియగుచు।

వ. మఱియు ననేకమారణోపాయంబులఁ బాపరహితుండైన పాపని రూపుమాపలేక యేకాంతంబున దురంతచింతాపరిశ్రాంతుం డయి రాక్షసేంద్రుండు తన మనంబున,

ఉ॥ ముంచితి వార్ధులం గదల • మొత్తితి శైలతటంబులందు ద్రో
బ్బించితి శస్త్రరాజిఁ బొడి • పించితి మీఁదనిభేంద్రపంక్తి ద్రొ
క్కించితి ధిక్కరించితి శ • పించితి ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితిఁ బెక్కుపాట్ల నల • యించితిఁ జావఁడిదేమి చిత్రమో॥

చ॥ ఎఱుఁగఁడు జీవనౌషధము • లెవ్వరుభర్తలు లేరు బాధలం
దఱలఁడు నైజతేజమున • దర్పము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచు నున్నవాఁడొకని • మెచ్చఁడు దైన్యము నొందఁడింక, నే
తెఱఁగునఁ ద్రుంతు వేసరితి • దివ్యము వీనిప్రభావమెట్టిదో!

వ॥ అదియునుంగాక తొల్లిశునశ్శేఫుండనుమునికుమారుండు తండ్రి చేత యాగపశుత్వంబునకుఁ దత్తుండయి తండ్రితనకు నపకారియని తలంపక బ్రదికినచందంబున,

క॥ ఆగ్రహమున నేఁ జేసిన
నిగ్రహములు పరులకొఁడ • నెఱి నొకవాఁడున్
నిగ్రహములనుచుఁ బలుకఁడ
నుగ్రహములుగా స్మరించు • నొవ్వఁడు మదిలోన్.

వ॥ కావున నీఁడు మహాప్రభావసంపన్నుఁడు. వీనికెందునుభయంబు లేదు. వీనితోడి విరోధంబునందనకు మృత్యువు సిద్ధించునని నిర్ణయించి చిన్నఁబోయి యున్నండై ప్రసన్నుండుగాక క్రిందుచూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁ జండామార్కు లిట్లనిరి,

శా॥ శుభ్రఖ్యాతిప నీప్రతాపము మహా • చోద్యంబు దైత్యేంద్రరో
షభ్రూయుగ్మవిజృంభణంబున దిగీ • శవ్రాతముల్ పోరులన్

విభ్రాంతంబుగఁ జేసి యేలితి గదా ♦ విశ్వంబు నీ వెంత యీ
దభ్రోక్తుల్ గుణదోష హేతువులు చిం ♦ తంబొందనీ కేటికిన్.

శా॥ పట్రించెడిన జనుండు వృద్ధగురుసే ♦ వం జేసి మేధానయో
పశాంతిన్ విలసిల్లుమీఁదట పయః ♦ పాకంబులో బాలకుల్
శక్రిద్వేషణ బద్ధుఁ జేయుము మనం ♦ జాలింపు మీగోపముల్
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడుల్ ♦ సుశ్రీయుతుండయ్యెడున్.

వ. అనిగురుపుత్రులు పలికిన రాజుసేశ్వరుండు గృహస్థులయిన రాజులకు నుపదేశింపఁదగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞసేసిన వారునతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైనవారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులుఁ దనకు నగ్రాహ్యంబు లనియును, వ్యవహారప్రసిద్ధి కొఱకైన భేదంబుగాని యాత్మభేదంబు లేదనియును, ననర్థంబులగుం దర్కకల్పనంబు సేయుట దిగ్భ్రమంబనియును, నిశ్చయించి గురూపదిష్టశాస్త్రంబులు మంచివని తలంచక గురువులు దమ గృహస్థకర్మానుష్ఠానంబులకుఁ బోయిన సమయంబున.

క॥ ఆటలకుఁ దన్నురమ్మని
పాటించి నిశాటసుతులు ♦ భాషించినదో
పాటకులెందఱుకుమారుఁడు
పాటవమున వారిఁ జేరి ♦ ప్రజ్ఞాన్వితుఁడై.

క॥ చెప్పెడు నొకచదువు మంచిది
చెప్పెడిదగులములు నెపులు ♦ సిందఱుఁగొనఁగా
జెప్పెను మనయొద్ద నొజ్జలు
సెప్పెద నొకచదువు వినుఁడు ♦ చిత్తములలరన్.

వ॥ అనిరాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ

నగి నొడిచందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమా
రుల నెల్ల నేకాంతంబున నిట్లనియె:

ఉ॥ బాలకులార! రండు మన ♦ ప్రాయపు బాలుఁగఁ గొందఱుర్విపైఁ
గూలుటఁ గంటిరే గురుఁడు ♦ గూర్పఁడు దనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనము ♦ జెప్పెడి గ్రాహ్యము గాదు శాస్త్రముల్
మేలెఱిఁగించెదన్ వినిన ♦ మీకు నిరంతరభద్రమయ్యెడిన్.

వ. వినుండు. సకలజన్మంబులందును ధర్మార్థాచరణకారణం
బయిన మానవజన్మంబు దుర్లభం బందుఁ బురుషత్వంబు దుర్గమంబ
దియు శతవర్షపరిమితంబైన జీవితకాలంబున నియతంబై యుండు నందు
సగమంధకారబంధురంబగు రాత్రిరూపంబున నిద్రాదివ్యవహారంబుల
నిరర్థకంబయి చనుఁ జిక్కినకొంచాళద్వత్సరంబులందును బాల్యకైశోర
కౌమారాదివయోవిశేషంబుల వింశతిహాయనంబులు గడచుఁ గడమను
వృదియబ్రంబులు నింద్రియంబులచేత బట్టువడి దురవగాహంబులయిన
కామక్రోధలోభమోహమదమత్సరంబులను పాశంబుల గట్టువడి విడి
వడ సమర్థుండుగాక ప్రాణంబులకంటె మధురాయమానంబైన తృష్ణకు
లోనై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి
పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగచాతుర్యసౌందర్యవిశేషంబుల
ధైర్యవల్లికాలవిత్రంబులయిన కళత్రంబులను మహనీయమంజుల మధు
రాలాపంబుల గలిగి వశులయిన శిశువులను శీలవయోరూపధన్యలగు
కన్యలను వినయవివేక విద్యాలంకారులయిన కుమారులను, గామితఫ
లప్రదాతలగు భ్రాతలను మనుష్యప్రేమ ధైర్యజనకులయిన జననీజన
కులను, సకలసౌజన్యసింధువులయిన బంధువులను, ధనకనకవస్తువాహ
న సుందరంబులయిన మందిరంబులను, సుకరంబులైన భృత్యనికరంబు
లను, వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను, వర్జింపలేక సంసా
రంబు సర్జించు నుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వారశూన్య

బయిన మందిరంబునఁ జేతిచుట్టువడి వెడలెడి పాటవంబుసాలక తగులు వడు కీటకంబుచందంబున గృహస్థుండు స్వయంకృత కర్మబద్ధుండై శిశ్నోదరాదిసుఖంబులఁ బ్రమత్తుండయి నిజకుటుంబ పోషణపారవశ్యంబున విరక్తిమార్గంబు దెలియనేరక స్వకీయపరకీయ భిన్నభావంబున నంధకారంబునఁ బ్రవేశించుంగావున కౌమారసమయమ్మున మనీషాగరిష్ఠుండై పరమభాగవతధర్మంబు ననుష్ఠింపవలయు. సుఖంబులు వాంఛితంబులుగాక చేకుఱుభంగి సుఖంబులును, గాలానుసారంబులై లబ్ధంబులగుంగావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయం జనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. మాయాత్ముడైన దేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవిందసేవనంబు కర్తవ్యంబు.

సీ॥ కంటిరే మనవారు ♦ ఘనులు గృహస్థులై
    విఫలులై కైకొన్న ♦ వెఱ్ఱితనము
భద్రస్థులైయుండి ♦ పాయరు సంసార
    పద్ధతినూరక ♦ పట్టువడిరి
కలయోనులందెల్ల ♦ గర్భాద్యవస్థలఁ
    బురుషుండు దేహియై ♦ పుట్టుచుండు
దన్నెఱుంగఁడు కర్మ ♦ తంత్రుఁడై కదపట
    ముట్టఁడు భవశీత ♦ ములకునయిన

ఆ॥ దీన శుభములేదు ♦ దివ్యకీర్తియులేదు
జగతిఁ బుట్టిపుట్టి ♦ చచ్చిచచ్చి
పొరలనేల మనకుఁ ♦ బుట్టని చావని
త్రోవవెదకికొనుట ♦ దొడ్డతనము.

శా॥ హాలాపానవిజృంభమాణమదగ ♦ ర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయసం ♦ బద్ధాత్ములై లోకముల్
వేలానిస్సరణంబుగానక మహా ♦ విద్యానుషంగామినీ
హేలాకృష్టకురంగశాబకముగన్ ♦ హీనస్థితిన్ వింటిరే.

*　　*　　*　　*

సీ॥ సంసారమిది బుద్ధి ♦ సాధ్యముగుణకర్మ
　　గణబద్ధ మజ్ఞాన ♦ కారణంబు
కలవంటి దింతియు ♦ కాని నిక్కముగాదు
　　సర్వార్థములు మన ♦ స్సంభవములు
స్వప్నజాగరములు ♦ సమములు గుణహీనుఁ
　　డగువరమునికిగు ♦ ణాశ్రయమున
భవ వినాశంబులు ♦ వాటిల్లినట్లుండు
　　బట్టిచూచిన లేవు ♦ బాలులార.

తే॥ కడగి త్రిగుణాత్మకములైన ♦ కర్మములకు
జనకమై వచ్చునజ్ఞాన ♦ సముదయమును
ఘనతరజ్ఞానవహ్నిచేఁ ♦ గాల్చిపుచ్చి
కర్మవిరహితులై హరిఁ ♦ గనుటమేలు.

*　　*　　*　　*

క॥ దానవ దైత్య భుజంగమ
మానవ గంధర్వసురస ♦ మాజములో ల
క్ష్మీనాథుచరణకమల
ధ్యానంబున నెవ్వఁడయిన ♦ ధన్యతనొందున్.

క॥ చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచ ♦ శీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కిన క్రియనచ్యుతుండు ♦ సిద్ధమునొండీ.

కం॥ చాలదు భూదేవత్వము
సాలదు దేవత్వ మధిక ♦ శాంతత్వంబుం
జాలదుహరి మెప్పింపఁ, ని
శాలోద్యములార! భక్తి ♦ సాలినభంగిన్.

ఆ॥ దనుజ భుజగయక్ష ♦ దైత్యమృగాభీర
సుందరీ విహంగ ♦ శూద్రశబరు
లైనఁ బాపజీవు ♦ లైనముక్తిఁజెందు
రఖిలజగము విష్ణు ♦ డనుచుఁదలఁచి.

కం॥ గురువులు తమకునులోఁబడు
తెరువులుసెప్పెదరు విష్ణు ♦ దివ్యపదవికిన్
దెరువులు సెప్పరు-చీకటిఁ
బరువులువెట్టంగనేల ♦ బాలకులారా.

కం॥ తెండ్లపుస్తకంబులు
నిం డాచార్యునకు మరల ♦ నేకతమునకున్
రండు విశేషముసెప్పెదఁ
బాం డొల్లనివారు కర్మ ♦ పుంజము పాలై.

కం॥ ఆడుదము పాడము హరిరతిఁ
బాడుద మెప్రొద్దువిష్ణు ♦ భద్రయశంబుల్
వీడుదము దనుజసంగతిఁ
గూడుదము ముకుందభక్త ♦ కోటిన్ గూటిన్.

కం॥ విత్తము సంసృతిపటలము
వ్రిత్తము కామాదివైరి ♦ వర్గంబులనేఁ
డిత్తము చిత్తముహరికిని
జొత్తము నిర్వాణపదము ♦ శుభమగుమనకున్.

శా॥ మానున్ శాంతగుణప్రధాను నతినం ♦ శుద్ధాంచితజ్ఞాను స
జ్ఞానారణ్యకృశాను నంజలిపుటీ ♦ సంభావ్యమానున్ సదా
శ్రీనారాయణపాదపద్మయుగళీ ♦ చింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ ♦ దేవాహితుం దుగ్రతన్.

సీ॥ అస్మదీయం బగు ♦ నాదేశమునఁగాని
మిక్కిలి రవిమింట ♦ మెఱయ వెఱచు
నన్నికాలములందు ♦ ననుకూలుఁడై కాని
విద్వేషియై గాలి ♦ వీవ వెఱచు
మత్ప్రతాపానల ♦ మందీకృతార్చియై
విచ్చలవిడి నగ్ని ♦ వెలుఁగ వెఱచు
నతిశాతమైన నా ♦ యాజ్ఞనుల్లంఘించి
శమనుండు ప్రాణులఁ ♦ జంప వెఱచు

తే॥ నింద్రుఁడాదిగ నామ్రోల ♦ నెత్త వెఱచు
నమరకిన్నరగంధర్వ ♦ యక్షవిహగ
నాగవిద్యాధరావలి ♦ నాకు వెఱచు
నేల వెఱవవు పలుకవ నీ ♦ కేది దిక్కు.

శా॥ ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుం ♦ భద్ద్వేషులయ్యున్ మదా
జ్ఞాభంగము సేయనోడుదురు రో ♦ షాపాంగదృష్టిన్ వివే
కజ్ఞానచ్యుతులై జగత్త్రితయమున్ ♦ గంపించు నీవిట్టిచో
నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి సా ♦ హంకారతన్ దుర్మతీ.

శా॥ కంఠక్షోభముగాఁగ నొత్తిలి మహా ♦ గాఢంబుగా డింభ! వై
కుంఠుం జెప్పెదు దుర్జయుండనుచు నై ♦ కుంఠుండు సర్వప్రభో
త్కంఠాబంధురుఁడేసి నేనసురులన్ ♦ ఖండింపఁ దండింపఁగాఁ
గుంఠీభూతుఁడుగాక రావలదె మ ♦ ద్ఘోరాహవక్షోణికిన్.

శా. ఆచార్యోక్తముగాక బాలురకు మీ ♦ కానక్తిఁబుట్టించి నీ
వాచాలత్వముఁ జూచి విష్ణు సహితున్ ♦ వర్ణించి మద్దైత్యవం
శాచారంబులు నీఱుచేసితివి మూ ♦ ఢాత్ముంగులద్రోహినిన్
నీచుం జంపుట మేలు చంపి కులముల్ ♦ నిర్దోషముం జేసెదన్.

క॥ దిక్కులు గెలిచితినన్నియు
దిక్కెవ్వఁడు రోరినీకు ♦ దేవేంద్రాదుల్
దిక్కుల రాజులు వేఱొక
దిక్కుఱుఁగక కొలుతురితఁడె ♦ దిక్కనినన్.

క॥ బలవంతుఁడ నే జగముల
బలములతోఁ జనక వీర ♦ భావమున మహా
బలులజయించితి నెవ్వని
బలమున నాడెదవు నాకుఁ ♦ బ్రతివీరుఁడవై.

వ—అనినఁ దండ్రికి మెల్లనవినయంబునఁ గొడుకిట్లనియె.

క॥ బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు ♦ బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు ప్రాణులకును
బలమెవ్వం డట్టివిభుఁడు ♦ బలము సురేంద్రా.

క॥ దిక్కులు గాలముతో నే
దిక్కున లేకుండుఁ గలుగు ♦ దిక్కుల మొదలై
దిక్కుగలలేనివారికి
దిక్కయ్యెడువాఁడు నాకు ♦ దిక్కు మహాత్మా.

సీ॥ కాలరూపంబుల ♦ గ్రమవిశేషంబుల
సలఘుగుణాశ్రయుం ♦ డయినవిభుఁడు
సత్త్వబలేంద్రియ ♦ సహజప్రభావాత్ముఁ
డై వినోదంబున ♦ సకలజగము

గల్పించు రక్షించు ♦ ఖండించు నవ్యయుం
డన్నిరూపములందు ♦ నతఁడు గలఁడు
చిత్తంబు సమముగాఁ ♦ జేయుము మార్గంబు
దప్పి వర్తించు చి ♦ త్తంబుకంటె

తే॥ వైరులెవ్వరు చిత్తంబు ♦ వైరి గాక
చిత్తమును నీకు వశము గాఁ ♦ జేయుమయ్య
మదయుతాసురభావంబు ♦ మానవయ్య
యయ్య నీమ్రోల మేలాడ ♦ రయ్య జనులు॥

ఉ. లోకములన్నియున్ గడియ ♦ లోన జయించిన వాఁడ వింద్రియా
నీకము జిత్తమున్ గెలువ ♦ నేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రులార్వురఁ బ్ర ♦ భిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకఁడు ♦ నేర్పునఁ జూడుము దానవేశ్వరా॥

క॥ పాలింపుము శేముషి ను
న్మూలింపుము కర్మబంధ ♦ ముల సమదృష్టిం
జాలింపుము సంసారము
గీలింపుము హృదయమందుఁ ♦ గేశవభక్తిన్॥

వ॥ అనినఁ బరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుం డిట్లనియె.

క॥ చంపినఁ జచ్చెదననుచును
గంపింపక యోరిపడుచ ♦ కఠినోక్తుల నన్
గుంపించెదు చావునకుం
దెంపరివై వదరువాని ♦ తెఱఁగుమతీ.

శా॥ నాతోఁ డంబరిభాషలాడెదు జగ ♦ న్నాథుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁడొకఁడు సం ♦ పూర్ణప్రభావుండ మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వదలితిం ♦ బల్మారు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ ♦ డెందుండురా దుర్మతీ.

క॥ ఎక్కడఁగలఁ డేక్రియ నే
చక్కటివర్తించు నట్టి ♦ జాడనువచ్చుం
జక్కడఁతు నిన్ను విష్ణుని
బెక్కులు ప్రేలెదవు వాని ♦ భృత్యునిపగిదిన్.

వ॥ అనిన హరికింకరుండు శంకింపక సాంద్రపులకాంకురసంకలిత విగ్రహుండై యాగ్రహంబులేక హృదయంబున హరిందలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబుసేయుచు.

మ॥ కలఁడంభోధిఁ గలండు గాలిఁ గలఁడా ♦ కాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలన్ బగళ్ళనిశలన్ ♦ ఖద్యోతచంద్రాత్మలం
గలఁడోంకారమునన్ ద్రిమూర్తులఁ ద్రిలిం ♦ గవ్యక్తులం దంతటం
గలఁడీశుండు గలండు తండ్రి వెదకం ♦ గా నేలయీయా యెడన్.

క॥ ఇందుగలఁ డందు లేడని
సందేహము వలదు చక్రి ♦ సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దాన ♦ వాగ్రణివింటే.

వ॥ అని యివ్విధంబున,

మ॥ హరి సర్వాకృతులం గలండనుచుఁ బ్ర ♦ హ్లాదుండు భాషింప స
త్వరుఁడై యెందును లేఁడు లేఁడనుచు ♦ దైత్యుండు దర్శింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుఁడు ♦ నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్ని దేశముల ను ♦ ద్దండప్రభావంబునన్.

వ—అయ్యవసరంబున నద్దానవేంద్రుండు.

క॥ డింభక! సర్వస్థలముల
నంభోరుహనేత్రుఁ డుండు ♦ ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ
స్తంభంబునఁ జూపఁగలవె ♦ చక్రిన్ గక్రిన్.

క. స్తంభమునఁ జూపవే నీ
కుంభిని నీశిరముఁ ద్రుంచి ♦ కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి
స్తంభంబున నడ్డపడఁగ ♦ శక్తుండగునే.

వ॥ అనిన భక్తవత్సలుని భటుం డిట్లనియె.

శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణప ♦ ర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ విపుల ♦ స్తంభంబునం దుండఁడే
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే ♦ సందేహముం లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్ర ♦ త్యక్షస్వరూపంబునన్.

మ॥ వినరా డింభక! మూఢచిత్త! గరిమన్ ♦ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెదవైన నిందుఁ గలఁడే ♦ యంచున్ మదోద్రేకియై
దనుజేంద్రుండఱచేత వేసెను మహా ♦ దగ్రప్రభాస్తంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరిజను ♦ స్సంరంభమున్ స్తంభమున్॥

క॥ నరమూర్తిగాదు కేవల
హరిమూర్తియుఁగాదు మాన ♦ వాకారము కే
సరి యాకారమునున్నది
హరి మాయారచితమగు య ♦ థార్థమునాడన్.

ఉ॥ తెంపున బాలుఁడాడినసు ♦ ధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁదలంచి యిందు నర ♦ సింహశరీరము దాల్చి చక్రి శి
క్షింపఁగవచ్చినాఁడు హరి ♦ చే మృతియించుఁదలంతునైన నా
సొంపును బెంపునందఱును ♦ జూడఁ జరింతు హరింతు శత్రుపున్॥

మ॥ విహగేంద్రుం డహివ్రచ్చునట్ల వడి మహా ♦ దర్పోద్ధతిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసం ♦ ఘాతంబులన్ వ్రచ్చెదు
స్పృహుదంభోళికఠోరదేహు నచలో ♦ త్సాహున్ మహాబాహునిం
ద్రిజగత్కాంతకభీకరున్ ఘనకరున్ ♦ దైత్యాన్వయశ్రీకరున్.

సీ॥ నీగృహాంగణభూమి • నిటలంబుమోవంగ
మోదించినిత్యంబు • మ్రొక్కఁడేని
నీసుంగళస్తవ • నికరవర్ణంబులు
తలఁపుమాఱుపాలుకఁ • బలుకఁడేని
నీయధీనములుగా • నిఖిలకృత్యంబులు
ప్రియభావమున సమ • ర్పింపఁడేని
నీపదాంబుజముల • నిర్మలహృదయుఁడై
చింతించిమక్కువఁ • జిక్కఁడేని

తే॥ నిన్నుఁ జెవులార వినఁడేని • నీకుసేవ
సేయరాదేని బ్రహ్మంబుఁ • జెందఁగలఁడె
యోగియైనఁ దపోవ్రత • యోగియైన
వేదియైన మహాతత్త్వ • వేదియైన.

—శివుఁడు గరళమును మ్రింగుట—

మ॥ కదలం బాఱవు పాపపేరు లొడలన్ • ఘర్మాంబుజాలంబు పు
ట్టదు నేత్రంబుల కెఱ్ఱరాదు నిజజూ • టార్ధేందుఁడున్ గందఁడున్
వదనాంభోజము వాడఁ గావిగమి నా • హ్వానించుచో దాయుచోఁ
బదిలుండై కడిసేయుచోఁ దిగుచుచో • భక్షించుచో మ్రింగుచోన్.

క॥ ఉదరము లోకంబులకును
సదనంబగుటెఱిఁగి శివుఁడు • చటులవిషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ
బదిలంబుగ నిలిపె నాత్మ • ఫలగతినధిపా.

క॥ మెచ్చిన మచ్చిక గలిగిన
నిచ్చిన నీవచ్చుఁగాక • యిచ్చనొరులకుం
జిచ్చుఁగడిఁగొనఁగవచ్చున
చిచ్చఱమావమ్మవడిన • శివునకుఁదక్కన్॥

ఆ॥ హరుఁడు గళమునందు ♦ హాలాహలము బెట్టఁ
గప్పుగలిగి తొడవు ♦ గరిమనొప్పె
సాధురక్షణంబు ♦ సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె ♦ భూవరేంద్ర.

—క్షీరసాగరమునఁ బుట్టిన లక్ష్మి విష్ణుమూర్తి వరించుట.—

సీ॥ అమరముత్తైదువ ♦ నైయుండవచ్చును
వరుసకు సవతులె ♦ వ్వరును లేరు
వెలయంగ నశ్రాంత ♦ విభవమీతనియిల్లు
శృంగారచందన ♦ శీతలుండు
కలఁగఁడెన్నఁడుశుద్ధ ♦ కారుణ్యమయమూర్తి
విమలాంగుఁడు గదిసిసే ♦ వింపవచ్చు
నెఱిపాడి తిరుగఁడు ♦ నిలుకడఁ గలవాఁడు
సకలకార్యములందు ♦ జడతలేక.

ఆ॥ సాధురక్షకుండు ♦ షడ్వర్గరహితుండు
నాథుఁడయ్యెనేని ♦ నడవనొప్పు
నితఁడె భర్తయనుచు ♦ నింతిసరోజాక్షుఁ
బుష్పదామకమునఁ ♦ బూజసేసె.

క॥ ఇందీవరదామమున ము
కుందునిఁ బూజించి తనకుఁ ♦ గూడివసింపన్
మందిరముగఁ దద్వక్షము
నందంద సలజ్జదృష్టి ♦ నాలోకించెన్.

ఆ॥ మోహరుచులవలన ♦ ముద్దియ తలయెత్తు
సిగ్గువలనఁ జాల ♦ శిరము వంచు
నింతివెఱఁగువలన ♦ నెత్తదు వంచదు
తనదు ముఖము ప్రీతి ♦ దయితుఁజూచి.

క॥ హరిసూచిన సిరిసూడదు
సిరిసూచిన హరియుఁజూడ ♦ సిగ్గునఁబొందున్
హరియును సిరియును దమలోఁ
సరిఁజూపుల, జూచుమరుఁడు ♦ సందడిపెట్టెన్,

చ॥ జగములతండ్రియై తనరు ♦ శౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చెనఁటఁ ♦ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటి భంగి నతి ♦ మంగళసాధ్వి పతిత్వసంపదన్
నెగడినలోకముల్ గని ర ♦ నేకశుభంబులఁబొంది రత్తఱిన్.

—వామన చరిత్రసంబంధమైన పద్యములు—

శా॥ చండస్ఫూర్తి వటుండుగాంచె బలుధా ♦ జల్పాంక శాటంబు ను
ద్దండాహూతమునిత్యభిత్యదయ్యుత్తా ♦ ధస్నిద్ధకూటంబు వే
దండాశ్వధ్వజ నీకవాటము, మహా ♦ ద్యద్ధామసంఛన్నమా
ర్తండస్యందనఘోషమున్ బలిమఖం ♦ బర్త్యాదికావాటమున్.

మ॥ ఇతఁడే దానవచక్రవర్తి సురలో ♦ కేంద్రాగ్నికాలాది ది
క్పతిగర్వాపహచక్రవర్తి గతిలో ♦ ధస్ఫూర్తి నానాముఖ
వ్రతదానప్రవణానువర్తి సుమనో ♦ రామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి సత్యకరుణా ♦ ధర్మోల్లసన్మూర్తి దానౌ.

ఉ॥ స్వస్తి జగత్త్రయీభువన ♦ శాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్తనిలింపభర్తకు ను ♦ దారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వర వి ♦ ధాన విహర్తకు సర్వరీగళ
న్న్యస్తసువర్ణపాత్రపరి ♦ హర్తకు దానవలోకభర్తకున్.

మ॥ వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం ♦ వాసస్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమ ♦ య్యెన్ వంశమున్ జన్మముం
గడు ధన్యాత్ముఁడ నైతి నిమ్మఖము నే ♦ డగ్ర్యంబయ్యె నాకోరికల్
గడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం ♦ గల్యాణకాలమున్.

మ॥ వరచేలంబులొ మాడలో ఫలములో ♦ వన్యంబులో గోవులో
హారులో రత్నములో రథంబులొ విశి ♦ ష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో ♦ గ్రామంబులో భూములో
ధరణీఖండమొ గాక యేమడిగెదో ♦ ధాత్రీసురేంద్రోత్తమా.

సీ॥ ఇదె నాకు నెలవని ♦ యేరీతిఁ బలుకుదు
నొకచోటనక యుండు ♦ నుండనేర్తు
నెవ్వరివాఁడనం ♦ చేమని నుడువుదు
నాయంతవాఁడనై ♦ నడువనేర్తు
నీనడవడి యని ♦ యెట్లు వక్కాణింతుఁ
బూని ముప్పోకలఁ ♦ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు ♦ నని యేల చెప్పంగ
నేరుపు లన్నియు ♦ నేన నేర్తు

ఆ॥ నొరులుఁ గారు నాకు ♦ నొరులకు నే నౌదు
నొంటివాఁడఁ జుట్ట ♦ మొకఁడు లేఁడు
సిరియుఁ దొల్లి గలదు ♦ చెప్పెద వాకింక
సుజనులందుఁ దఱచు ♦ చొచ్చియుందు.

క॥ రాజ్యము గలిగిన మీఁదట
బూజ్యులకును యాచకులకు ♦ భూమిసురులకున్
భాజ్యముగ బ్రతుకఁ డేనిం
ద్యాజ్యంబులు వాని జన్మ ♦ ధన గేహంబుల్.

క॥ వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైనఁ ♦ బదివేలనుచుం
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపముల నైనఁ ♦ జక్కంబడునే.

శా॥ ఆశాపాశము దాఁ గదుర్ నిడుపు లే ♦ దంతంబు రాజేంద్ర, వా
రాశిప్రావృతమేదినీవలయ సా ♦ మ్రాజ్యంబు చేకూరియున్
గాసింబొందిరిగాక వైన్యగయభూ ♦ కాంతాదులు నర్థా
మాశల్ బాయఁగనేర్చిరే మును సిబా ♦ శాంతంబులం జూచిరే.

సీ॥ సంతుష్టుఁడీమూఁడు ♦ జగములఁ బూజ్యుండు
సంతోషి కెవ్వాడు ♦ జరుగు సుఖము
సంతోషి గాకుంట ♦ సంసారహేతువు
సంతసంబున ముక్తి ♦ సతియు దొరకుఁ
బాఁటువాటున జగం ♦ బుల యదృచ్ఛాలాభ
తుష్టిని దేజంబు ♦ దోన పెరుగుఁ
బరితోషహీనతఁ ♦ బ్రభ చెడిపోవును
జలధార ననలంబు ♦ సమయునట్లు

ఆ॥ నీవు రాజవనుచు ♦ నిఖిలంబు నడుగుట
దగవుగాదు నాకుఁ ♦ దగిన కొలఁది
యేను వేఁడికొనిన ♦ యీ పదత్రయమును
జాలదనకయిమ్ము ♦ చాలుఁ జాలు.

సీ॥ ఇచ్చెదననిబల్కి ♦ యీకున్న నరకంబు
ద్రోవ నీవును సమ ♦ ర్థుఁడవు గాన
యేదానమున నాశ ♦ మే తెంచునదియును
దానంబు గాదండ్రు ♦ తత్త్వవిదులు
దానంబు యజ్ఞంబుఁ ♦ దపముఁ గర్మంబును
దావిత్తవంతుఁడై ♦ తలఁపవలయుఁ
దనయింటఁ గల సర్వ ♦ ధనమును నైదు భా
గములుగా విభజించి ♦ కామమునకు

ఆ॥ అర్థమునకు ధర్మ ♦ యశముల కాశ్రిత
బృందములకు క్షమతఁ ♦ బెట్టునట్టి
పురుషుఁ డిందునందుఁ ♦ బూర్ణుఁడై మోదించు
దన్నుఁ దూని చేత ♦ దగవు గాదు.

సీ॥ అంగీకరించిన ♦ యఖిలంబుఁ బోవుచో
ననృతంబుగాదు, లే ♦ దనిన యధిక
యాత్మవృక్షము మూల ♦ మనృతంబు నిశ్చయ
మనృతమూలము గల్గ ♦ నాత్మ చెడదు
పుష్పఫలములాత్మ ♦ భూజంబునకు సత్య
మామూలిను బ్రదుకదు ♦ నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక ♦ వసివాడి వృక్షంబు
మూలంబుతోఁ వృద్ధిఁ ♦ బొందుఁ గాని

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ ♦ జెందకుండ
నిచ్చు పురుషుండు చెడకుండు ♦ విద్ధచరిత
కాకయుండిత సత్యసం ♦ గతి నటంచు
నిజధనం బర్థికిచ్చిన ♦ నకు లేఁరు.

ఆ॥ వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
బ్రాణవిత్తమాన ♦ భంగమందుఁ
జకిత గోకులాగ్ర ♦ జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము ♦ వొందదధిప.

సీ॥ నిజవ నతిచ్చితి ♦ నీవు మహాత్మక
సహిత గృహస్థ ధ ♦ ర్మంబు నదియు
యథార్థంబుగా నొంబు ♦ యశమును వృత్తియు,
నైశ్వర్యాది పార్థింప ♦ నిత్తునని యు

నర్థలోభంబున • నర్థిఁ బొమ్మనుటెట్లు
కలిగి లేదను కంటెఁ • బాప మెద్ది
యెట్టిఘోరాత్ముని • నేభరించెదఁ గాని
సత్యహీనుని మోవఁ • జాలననుచు

తే॥ కలుగదే తొల్లి భూదేవి • బ్రహ్మతోడ
సమరమందుఁ దిరుగక • చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ • బరగుకంటె
మానధనులకు భద్రంబు • మఱియుఁ గలదె.

క॥ ధాత్రినిహాలికునకును, సు
క్షేత్రము, బీజములు నొకటఁ • జేకుఱుభంగిన్
జిత్రముఁగ దాతకీవియుఁ
బాత్రము సమకూరునట్టి • భాగ్యముకలదే!

శా॥ కారే రాజులు రాజ్యముల్ • గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటఁ గట్టికొని పో • వం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం • బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే • యిక్కాలమున్ భార్గవా.

క॥ ఉడుగని క్రతువులఁ దపములఁ
బొడగనఁ జననట్టి పొడవు • పొడవున కుఱుచై
యడిగెడి నఁట నను బోటికి
నిడరాదె మహానుభావ • యిష్టార్థంబుల్.

శా॥ ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై • నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ • బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁ • దై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే • కాయంబు నాపాయమే.

మ॥ నిరయంబైన నిబంధమైన ధరణీ ♦ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ ♦ రానిమ్ము కానిమ్ము పో
హరియైనన్ హరుఁడైన నీరజభవుం ♦ డభ్యాగతుండైన నౌఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ♦ ధీవర్య వేయేటికిన్.

ఆ॥ నాఁడిది యంతవట్టు ♦ మము నలఁకయిచ్చుచో
నేలకట్లు విష్ణుఁ ♦ డేటికోట
గట్టి నేనిఁ దాన ♦ కరుణించి విడుచును
విడువకుండనిమ్ము ♦ విమలచరిత!॥

క॥ మేరువు దలక్రిందైనను
బారావారంబు లింకఁ ♦ బాఱిన లోలో
ధారుణి రజమైపోయినఁ
దారాధ్వము ఖండమైనఁ ♦ దప్పక యిత్తున్.

మత్తకోకిలము.—

ఎన్నఁడుం బరు వేడఁబోఁడఁట ♦ యేకలంబఁట కన్నవా
రన్నదమ్ములునైన లేరఁట ♦ యన్ని విద్యలమూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగుజ్జఁట ♦ చేతులొగ్గి వసింపనీ
చిన్నిపాపని ద్రోసిపుచ్చఁగఁ ♦ జిత్తమెత్తునసత్తమా.

ఆ॥ బ్రిదుకవచ్చుఁగాక ♦ బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైనఁ ♦ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు ♦ మానధనులు.

క॥ రమ్మా మాణవకోత్తమ!
లెమ్మా నీవాంఛితంబు ♦ లేదనకిత్తున్
డెమ్మా యడుగల నిటురా
నిమ్మా కడుకింగవలయు ♦ నేటికిఁ దడయన్.

మ|| బలిదైత్యేంద్రకరద్వయార్పితజల ♦ ప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె మౌనిమన ♦ స్సంప్రార్థిత శ్రీదమున్
గలితానమ్రసురాలలాటపదవీ ♦ కస్తూరికాపాదమున్
నలినామోదము రత్ననూపురితమా ♦ నావేదవంద్యంబు పాదమున్.

క|| సురలోకసముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల ♦ నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నిటఁగడిగె ♦ నసురోత్తముఁడున్.

శా|| విప్రాయ ప్రకటవ్రతాయ భవతే ♦ విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం ♦ దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రౌఢిఁ దనుజేశ్వరుండు వడుగుం ♦ జేసాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం ♦ బాశ్చర్యమున్ బొందఁగన్.

మ|| అమరారాతికరాబ్జోజ్ఝితపవి ♦ త్రాంభఃకణశ్రేణికిం
గమలాధీశ్వరుఁడొడ్డె ఖండితదివా ♦ కస్వామి జన్మస్తమున్
గమలాకర్షణసుప్రశస్తమా, రమా ♦ కాంతాకుచోపాస్తమున్
విమలశ్రీకుచశాతచూచుకతటీ ♦ విన్యస్తమున్ హస్తమున్.

క|| మునిజననియమాధారను
జనితాసురయువతినేత్ర ♦ జలకణధారన్
దనుజేంద్రనిరాధారను
వనజాక్షుఁడు గొనియె బలిచే ♦ వర్జితధారన్.

ఆ|| కమలనాభు నెఱిఁగి ♦ కాలంబు దేశంబు
నెఱిఁగి శుక్రుమాట ♦ నెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు ♦ నిచ్చె దానము బలి
మహివదాన్యుఁ డొరుఁడు ♦ మఱియుఁ గలఁడె.

మ॥ చెలియే మృత్యువు చుట్టమే యముఁడు సం ♦ సేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను దృఢమే ♦ జీవంబు నో చెల్లరే
చలితం బాటు మెఱుంగ రీకపటసం ♦ సారంబు నిక్కంబుగాఁ
దలఁచుం గా మూఢుఁడు సత్యదానకరుణా ♦ ధర్మాదినిర్ముక్తుఁడై.

సీ॥ చుట్టాలు దొంగలు ♦ సుతులు ఋణస్థులు
కాంతలు సంసార ♦ కారణములు
ధనము లస్థిరములు ♦ దనువతిచంచల
గార్హ్యార్థు లన్యులు ♦ గడచుఁగాల
మాయపునత్త్వర ♦ మైశ్వర్యమతిశీఘ్ర
మని కాదె తమతండ్రి ♦ నతిక్రమించి
మాతాత సాధు స ♦ మ్మతుఁడు ప్రహ్లాదుండు
నీపాదకమలంబు ♦ నియతిఁ జేరె.

తే॥ భద్రఁపతనికి మృతిలేని ♦ బ్రదుకు కలిగె
వైరులైకాని తొల్లి మా ♦ వారుగాన
రక్షివై వచ్చి నీవు ♦ నన్నడుగుటెల్ల
పద్మలోచన నాపుణ్య ♦ ఫలముగాదె.

—:మత్స్యరూపియగు శ్రీహరిని సత్యవ్రతుఁడు స్తుతించుట.—

మ॥ తమిలోఁ బుట్టు నవిద్యగప్పికొనుడుం ♦ దన్మూలసంసారవి
భ్రములై కొందఱు దేలుచుందురు గదా ♦ బల్వెంటలన్ దైవయో
గమునం జే పరమేశుఁ గొల్చినను లై ♦ కైవల్యసంప్రాప్తులై
భ్రమదంబందుదు రట్టినీవు కరుణం ♦ బాలింపుమమ్మీశ్వరా.

ఉ॥ కన్నులు లేనివాఁడు మఱి ♦ కానని వానికిఁ ద్రోవఁజూపఁగాఁ
జన్న తెఱంగు మూఢునకు ♦ సన్మతిఁ దాగురుఁ డౌటనార్యుఁడే
కన్నులుగాఁగ భూతములఁ ♦ గాంచుచునుండు రమేశ మాకును
ద్యన్నయమూర్తివై గురువ ♦ వై యల సద్గతి జూడఁజూపవే.

క॥ ఇంగలము సోఁడిసంగతి
బంగారము వన్నెగలుగు ♦ భంగిని ద్వత్సే
వాంగీకృతుల యఘంబులు
భంగంబులఁ బొందు ముక్తి ♦ ప్రాపించు హరీ.

క॥ హృదయేశ! నీవు ప్రసన్నత
పదివేలవ పాలిలేశ ♦ భాగముకతనం
ద్రిదసౌందర్యము గలదఁట
తుదినిను మెప్పింపనేది ♦ దొరకదు శ్రీశా.

క॥ పెఱవాఁడు గురుఁడటంచును
గొఱగాని పదంబుసూపఁ ♦ గుజనుండగు నీ
నెఱిఁ ద్రోవ నడవనేర్చిన
గఱగోఱ లేకున్న పదము ♦ గలుగు దయాబ్ధీ.

మ॥ చెలివై చుట్టమవై మనస్థితుఁడవై ♦ చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కుల పంటవై విభుఁడవై ♦ వర్తిల్లు నిన్నొల్లకే
పలు వెంటంబడి లోకమర్కటవృథా ♦ బద్ధాశమై పోయెదిన్
నిలువన్నేర్పున హేమరాశిఁ గనియున్ ♦ నిర్భాగ్యుఁడం భశ్యయా.

ఆ॥ సీరరాశిలోన ♦ నిజకర్మ బద్ధమై
యుదితనిద్రఁ బొంది ♦ యున్నలోక
మెమహాత్ము చేత ♦ నెప్పటికి మేల్కాంచు
నట్టినీవు గురుఁడ ♦ వౌటమాకు.

క॥ ఆలింపుము విన్నపమిదె
వేలుపుగమితేఁసినిన్ను ♦ వేడికొనియెదన్
నాలోని చిక్కుమానిచి
నీలోనికిఁ గొంచుఁ బొమ్ము ♦ నిఖిలాధీశా.

చక్రమునకు భయంబంది హరినిశరణంబు వేడిన దుర్వాసున
కాతఁ డంబరీషుని వేడుమని చెప్పుట.
(అంబరీష చరిత్రము.)

చ॥ చలమున బుద్ధిమంతులగు • సాధులు నాహృదయంబు లీలదాం
గిలికొనిపోవుచుందురు ర • కిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టికట్టుదురు • నేరుపుగా మదకుంభికైవడిన్
వలలకు జిక్కుభక్తజన • వత్సలతంబనుచుందుఁ దాపసా.

ఆ॥ నాకు మేలుగోర • నాభక్తులకఁ గాని
భక్తజనులకేను • పరమగతియు
భక్తుఁ డెందుఁజనిన • బఱతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులు • కోడెభంగి.

ఆ॥ తనువు మనువువిడిచి • తనయులఁ జుట్టాల
నాలివిడిచి సంప • దాలివిడిచి
నన్నుగాని యన్య • మెన్నఁడు నెఱుఁగని
వారివిడువ నెట్లు • వారినేన.

క॥ పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబులందు • వరమునులుప్రతి
ష్ఠించివహింతురు నన్నును
మంచిపతిన్ బుణ్యసతులు • మరగించుక్రియన్॥

క॥ సాధులహృదయము నాయది
సాధుల హృదయంబు నేను • జగములనెల్లన్
సాధులనేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు • చరితము విప్రా

ఆ॥ ధారుణీ సురులకు ♦ దపము విద్యయు రెండు
ముక్తి సేయుచుండు ♦ ముదముతోడ
దుర్వినీతులగుచు ♦ దుర్జనులగువారి
కవియుఁ గీడు సేయు ♦ కీలయుండు.

క॥ నా తేజము సాధువులో
నాతత్త్వము యెఱుఁగువారి ♦ నలచు జనులకున్
హేతిక్రియ భీతినిచ్చుం
జేతో మోదంబు జెఱచు ♦ సిద్ధము సుమ్మా.

క॥ అదెపో బ్రాహ్మణ! నీకును
వదయాఁడు నాభాగసుతుఁడు ♦ జనవినుతగుణా
స్పదుఁడిచ్చు నభయమాతని
మది సంతస గలిచి వేడు ♦ మాశరణంబున్.

—: పరశురాముఁడు. —

మ॥ కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు వమి ♦ త్రాక్షమునం బ్రకాశునిన్ శరా
సనతూణీరకుఠారభీము నతిరో ♦ షప్రోచ్ఛల ద్భ్రూయుగా
నన నేత్రాంచల సీము నైణపటనా ♦ నాటూలికోద్దాము నూ
తిన సంరంభ నరేంద్రదారశుభసూ ♦ త్రితూమునిన్ రామునిన్.

—: ముదిమి: —

(యయాతికి కుమారుఁడైన యదువు చెప్పుట)

శా॥ కాంతాహేయము బంధునింద్యము గురు ♦ కందూతిమిశ్రింబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము శ్రీ ♦ స్వేదప్రకారంవన
శ్రాంతిస్ఫోటనయుక్త మీముదిమి నా ♦ ఛలదాల్చి నానాసుఖో
పాంతంబైన వయోనిధానమిది యే ♦ మార్యాతేర యీపచ్చునే

— రంతిదేవుఁడు —

క॥ హీనుఁడఁ జండాలుండను
మానవకులనాథ దప్పి ♦ మానదు నవలం
బో నీరు లేక చిక్కిన
పానీయము నాకుఁ బోసి ♦ బ్రతికింపఁగదే.

వ—అనిన వాని దీనాలాపములకుఁ గరుణించి రాజిట్లనియె.

ఉ॥ అన్నము లేదు కొన్ని మధు ♦ రాంబువులున్నవి త్రావుమన్న రా
వన్న శరీరధారులకు ♦ నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్పి వారికి సు ♦ ఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురు ♦ షోత్తముఁడొక్కఁడె సుమ్ము పుల్కసా.

వ॥ అని పలి.

మ॥ జలవంతంబగు నీరువట్టున నిజ ♦ ప్రాణాంతమైయున్న చో
నలయుం డేమియు వీసమాత్రజ్వరము నా ♦ మానంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మానె నను చున్ ♦ సర్వేశ్వరాధీనుఁడై
జలము ల్పోసెను రంతిదేవుఁడు దయం ♦ జండాలపాత్రంబునన్.

— గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతలు యశోదాదేవితోఁ
జెప్పుట —

క॥ బాలురకుఁ బాలు లేవని
బాలెంతలు మొఱలు వెట్టఁ ♦ బకపక నగి యా
బాలుండాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె ♦ నంభోజాక్షీ.

క॥ ఎడతీ నీబిడ్డఁడు మా
కడవలలో నున్న మంచి ♦ కాఁగిన పాలా
వడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బోనడచె నాజ్ఞ ♦ కలదో లేదో.

క॥ మీపాపఁడు మాగృహముల
నాపోవఁగఁ బాలుద్రావి ♦ నగఁబడకున్నం
గోపించి చిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు ♦ వచ్చెందల్లీ.

మత్తకోకిలము—

పుట్టిపుట్టఁడు నేఁడుదొంగిలిఁ ♦ బోయిమాయిలుసొచ్చి తా
నుట్టియందక ఱోళ్లు పీటలు ♦ నొక్కప్రోవిడి యెక్కి చే
పెట్టఁజాలక యుండ క్రిందొక ♦ పెద్దతూటనరించి మా
పట్టి మీఁగడపాలు వారలఁ ♦ బట్టిద్రావెఁ దగోదరీ.

క॥ ఆశంజని వీరల పెరుఁ
గోడక నీసుతుఁడు ద్రావి ♦ యొకయించుక తాఁ
గోడలి మూతిం బూసిన
గోడలు మొచ్చెనుచు నత్త ♦ గొట్టెలతాంగీ.

క॥ వారిల్లుసొచ్చి కడవలఁ
దోరంబగు నెయ్యి ద్రావి ♦ తుదినా కడవల్
వీరింట నునుతుండిడ
వారికి వీరికిని దొడ్డ ♦ వాదయ్యె నతీ.

ఆ. నమ్మి నిదురపోవ ♦ నాకట్టిచుంచుమా
లెఁగతోఁకతోడ ♦ లీలఁ గట్టి
వీధులందుఁ దోలె ♦ వెలఁది నీకొమరుండు
రాచబిడ్డఁడైన ♦ నవ్వమేలె.

క॥ నాపట్టి పొట్టనిండఁగఁ
బైపడి నీపట్టి విస్సు ♦ చానెండిడినా
మూపిరి విడలదు వానిం
జూపెద నేమైన నీవ ♦ చుమ్ములతాంగీ.

సీ॥ కలకంఠి మావాడ ♦ గరితలమెల్ల నీ
పట్టి రాఁగలఁడని ♦ పాలుపెరుగు
లిండ్లలోఁ గలవని ♦ యేమెల్లఁ దనలోనఁ
జూచునో నప్పుడు ♦ సొచ్చువాఁడొ
తలుపుల ముద్రలు ♦ తాళంబులును బెట్టి
యున్న చందంబున ♦ నున్న వరయ
నొకయింటిలో నాఁడు ♦ నొకయింటిలోఁ బాడు
నొక యింటిలో నవ్వు ♦ నొకటఁ దిట్టు

ఆ. నొకట వెక్కిరించు ♦ నొక్కకచో మృగ
పక్షి ఘోషణములు ♦ పరగఁ జేయు
నిల్లు సేసి వెనుక ♦ నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్త ♦ కడవ లుండు.

— మృద్భక్షణ విశ్వరూపప్రదర్శనము —

క॥ మన్నేటికి భక్షించెదు
మన్నియమము లేల నీవు ♦ మన్నింపవు మా
యన్నయు సఖులును జెప్పెద
రన్నా మన్నేల పదరు ♦ దార్ధము లేదే.

వ.—అని పలికిన ముగుదతల్లికి నెఱదంటయైన కొడుకిట్లనియె—

శా॥ అమ్మా! మన్నుదినంగ నే శిశువునో ♦ యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ ♦ నన్నీవు గొట్టంగఁ దా
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా ♦ దేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్ ♦ దప్పైన దండింపవే.

వ.—అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నిమ్ముకొలిపి క్రీడా

మఱి బాలకుండైన యీశ్వరుండు తననోరు దెఱచి ముఖంబుఁ జూచిన

క॥ అలలితాంగి కనుంగొనె
బాలునిముఖమందు జలధి ♦ పర్వతవనభూ
గోళశిఖితరణిశశిది
క్పాలాదికరండమైన ♦ బ్రహ్మాండంబున్.

వ.—కనుంగొని

మ॥ కలయో వైష్ణవమాయయో యితరసం ♦ కల్పార్థమో సత్యమో
తలఁపన్ జాలక యున్నదాననొ యశో ♦ దాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతని ముఖ ♦ స్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహా ♦ శ్చర్యంబు చింతింపఁగన్.

ఆ. బాలమాత్రుఁడైన ♦ బాలునిముఖమందు
విశ్వమెల్ల నెట్లు ♦ వెలసియుండు
బాలుభంగి నితఁడు ♦ భాసిల్లుగాని స
ర్వాత్ముఁడాదివిష్ణుఁ ♦ డగుటనిజము.

— గోపబాలురు కృష్ణునిఁ గూడి చల్దులారగించుట. —

శా॥ ఎండన్ మ్రగ్గితి రాకటంబడిడితి రిం ♦ కేలా విలంబింపఁగా
రండో బాలకులార! చల్దిగుడువన్ ♦ రమ్యస్థలంబిక్కడి
దండన్ లేఁగలు నీరుద్రావి యిరవం ♦ దఁ బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించుచుండఁగ నమం ♦ దప్రీతి భక్షింతమే.

మ॥ జలదాంతస్థిత కర్ణికం దిరిగిరా ♦ సంఘంబులై యున్న రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ ♦ గూర్చుండి వీక్షించుచుం
శిలలుం బల్లవముల్ తృణంబులు లతల్ ♦ చిక్కంబులుం బువ్వు లా
కులుఁ గంచంబులుగా భుజించిరచటన్ ♦ గోపార్భకుల్ భూవరా.

సీ. మాటిమాటికి వ్రేలు ♦ మడిచి యూరించుచు
నూరుఁగాయలు దిను ♦ చుండు నొకఁడు
డొకనికంచములోని ♦ దొడిసిచయ్యనమ్రింగి
చూడు లేదని నోరు ♦ చూపు నొకఁడు
డేగు రార్గురుచల్దు ♦ లెలమిఁబన్నిదమాడి
కూర్కొనికూర్కొని ♦ కుడుచు నొకఁడు
పన్నియుఁ దగఁబంచి ♦ యిడుట నెచ్చెలి తన
మనుచుబం తెనగుండు ♦ లాడు నొకఁడు

ఆ. కృష్ణుఁ జూడుమనుచు ♦ గికురించి పరుమ్రోల
మేలిభక్ష్యరాశి ♦ మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల ♦ నవ్వించు నొకఁడు
ముచ్చటాడు నొకఁడు ♦ మురియు నొకఁడు.

సీ॥ కడుపున దిండుగాఁ ♦ గట్టిన వలువలో
లాలితవంశ నా ♦ ళంబుఁ జొనిపి
విమలశృంగంబును ♦ వేత్రదండంబును
జాఱిరా నీక డా ♦ చంకనిఱికి
మీఁగడ పెరుగున ♦ మేళవించినచల్ది
ముద్ద డాపలి చేత ♦ మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తె ♦ చ్చిన యూరుఁగాయలు
వ్రేళ్ళసందులనల్ల ♦ వెలయనిఱికి

ఆ. సంగడీలనడుమఁ ♦ జక్కఁగఁ గూర్చుండి
నర్మభాషణముల ♦ నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ ♦ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి ♦ చల్ది గుడిచె.

—♦ శ్రీకృష్ణుఁ డరణ్యమున గోపాలకులతోఁ గోవులఁ గాయుట ♦—

సీ॥ నిఖిలపావనమైన ♦ నీకీర్తిఁ బాడుచు
నీతుమ్మెదలు వెంట ♦ నేగుదెంచె
నడవిలోఁ గూర్చుండ ♦ వైనయాశుఁడవని
మునసరిఁగొల్వఁగవచ్చె ♦ మునిగణంబు
నీలాంబరముతోడి ♦ నీవుదీమూలతమ
వనినీలకంఠంబు ♦ లాడఁదొడఁగె
బ్రియముతోఁ జూచు గో ♦ పికలచందంబున
నిన్నుఁ జూచె నది వారి ♦ నిచయంబు

ఆ. నీవు విందవనుచు ♦ నిర్మలసూక్తులు
పలుకుచున్నవిచటఁ ♦ బరభృతములు
నేఁడు విపినచరులు ♦ నీవు విచ్చేసిన
ధన్యులైరిగాదె ♦ తలఁచిచూడ.

సీ॥ నీపాదములుసోకి ♦ నేఁడువీరుత్తృణ
పుంజంబుతోఁ భూమి ♦ పుణ్యయయ్యె
నీనఖంబులుదాఁకి ♦ నేఁడునానాలతా
తరుసంఘములు కృతా ♦ ర్థంబులయ్యె
నీకృపాదృష్టిచే ♦ నేఁడు నదీశైల
ఖగమృగంబులు దివ్య ♦ కాంతిఁ జెందె
నీవెన్నురము మోవ ♦ నేఁడుగోపాంగనా
జనములపుట్టువు ♦ సఫలమయ్యె

ఆ. ననియరణ్యభూమి ♦ నంకించిపశులను
మిత్రజనులుఁ దాను ♦ మేపుచుండి

నలినలోచనుండు ♦ నగములందు గిరులందు
సంతసంబు మెఱయ ♦ సంచరించె.

సీ. వేదాంతవీథుల ♦ విహరించువిన్నాణి
విహరించుఁగాంతార ♦ వీథులందు
ఫణిరాజశయ్యపైఁ ♦ బవళించుసుఖభోగి
పల్లవశయ్యలఁ ♦ బవ్వళించు
గురుయోగిమానస ♦ గుహలఁగ్రుమ్మరుమేటి
గ్రుమ్మరునద్రిందరి ♦ గుహలలోనఁ
గమలతోడఁ బెనంగి ♦ కడుడయ్యుచతురుఁడా
భీరజనులతోడఁ ♦ బెనఁగిడయ్యు

ఆ. సకలలోకములకు ♦ నాశ్రయుండగుధీరుఁ
డలసి తరులనీడ ♦ నాశ్రయించు
యోగభాగచయము ♦ లాహరించుమహాత్ముఁ
డడవిలోనిఫలము ♦ లాహరించు.

—♦ కాళియమర్దనము ♦—

మ. కటిసూత్రంబుబిగించి, పింఛమునఁ జ ♦ క్కంగొప్పునందించి, దో
స్తటసంస్ఫాలనమాచరించి చరణ ♦ ద్వంద్వంబుగీలించి, ఉ
త్కటశాఖాగ్రము మీఁదనుండియుఱికెన్ ♦ గోపాలసింహంబుది
క్తటముల్ మ్రోయహ్రదంబులో గుభగుభ ♦ ధ్వానంబునానాం
బుగన్.

ఉ. భూరిమహాహ్రదాంతవరి ♦ పూర్ణభయంకరఘోరవాలుకాం
తీరపపాతవేగవిశ ♦ లీకృతదుర్విషభీషణోర్మిసం
పూరితమై పడింగలఁగి ♦ పొంగి ధనుశ్శతమాత్రభాగవి
స్తారము వొంగెనమ్మడుఁగు ♦ తత్త రయోత్కరంబుద్బుదోగ్రమై.

శా॥ పాతిన్యాకృతిఁ దోయరాశినడుమన్ ♦ భాసిల్లియున్నాఢ్యుఁడై
కాతిన్యక్రియ నీఁదునేర్పు దనరన్ ♦ గల్మిన్ భుజంగేంద్ర హృ
త్ప్రీతాగ్రింబున రోమవహ్ని లెగయన్ ♦ భీమంబు గాసిఁదెను
ల్లోలోత్తుంగతరంగమై మునుఁగుడు ♦ ర్లోక్యంబుగా బాహులన్.

సీ॥ ఘనయమునానదీ ♦ కల్లోలఘోషంబు
సరస మృదంగ ఘో ♦ షంబుగాఁగ
సాధుబృందావన ♦ చరచంచరీకగా
నంబు గాయకనుగా ♦ నంబుగాఁగ
కలహంససారస ♦ కమనీయమంజు శ
బ్దంబులు దాళశ ♦ బ్దములుగాఁగ
దివినుండివీక్షించు ♦ దివిజగంధర్వాది
జనులు సభాసీన ♦ జనులుగాఁగ

తే॥ బద్మరాగాదిరత్నదీప్తి ♦ భాసమాన
మహితకాళీయఫణిఫణా ♦ మండపమున
నళినలోచన విఖ్యాత ♦ నర్తకుండు
నిత్యనైపుణ్యమునఁ జేసె ♦ నృత్యమాఁడె.

—॥ వేణుగానము ॥—

సీ॥ కర్ణావతంసిత ♦ కర్ణికారప్రభ
గండభాగద్యుతి ♦ గడలుకొలుప
భువనమోహనమైన ♦ భూరికలాపంబుతో
మభాగానతి ♦ వదనమొప్ప
నవనవ్యకరవ్యూహ ♦ లాంగుళీచాతురి
షడ్జధ్వనికిమూర్చ ♦ నరణిఁజూప
దానాలిమోద న ♦ ద్దనుసాఁదినిల్పి
వదనఖద్యుతి భూమి ♦ బ్రిబ్బికొనఁగ

తే॥ మౌళిపింఛముఁ గట్టి దా ♦ మమును మెఱయ
విలసితగ్రామముగ నొక్క ♦ వేణువందు
శ్రావ్యగాంధర్వగీతంబు ♦ పరఁగఁ జేసెఁ
జతురనటమూర్తి గోపాల ♦ చక్రవర్తి.

మ॥ అమరేంద్రాంగన లాకసంబున విమా ♦ నారూఢలై పొంగుచుం
గమలాక్షుం శుభమూర్తిఁ గాంచి మురళీ ♦ గానంబులం దందఱక
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా ♦ నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై ♦ పంచాశుగభ్రాంతలై॥

ఉ॥ కానలనుండుచున్ సరస ♦ గాన వివేకవిహీనజాతులై
వీనుల నేఁడు కృష్ణముఖ ♦ వేణురవామృతధార సోకినన్
మేనులు మేఁతలున్ మఱచి ♦ మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని! చూడవమ్మ బహు ♦ మానము సేసెఁ గృతార్థచిత్తలై॥

ఉ॥ తల్లులచన్నుఁ బాలు గుడు ♦ ద్రావుట తెం డమకర్ణవీథులన్
వల్లభమైన మాధవుని ♦ వంశరవామృతధార సొచ్చినం
దుల్లక పాలు రాదివక ♦ దూఁటక మానక కృష్ణుమీఁద దృ
గ్వల్లులు సేర్చి నిల్చె సదె ♦ వత్సము లంగనలార! కంటిరే.

మ॥ మమతన్ మోములు మీఁది కెత్తుకొని రో ♦ మంథంబు సారించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణుఁ జల్పి మురళీ ♦ గానామృతశ్రీకక
ర్ణములం గ్రోలుచు మేఁతమాని గళితా ♦ నందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్నవవిగో ♦ పద్మాక్షి! వీక్షించితే.

మ॥ జగతీజంబుల శాఖ లెక్కి మురళీ ♦ శబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి వేఁగుపడి నె ♦ మ్మిం గృష్ణరూపంబు చి
త్తగమై యుండఁగ నడ్డువెట్టు క్రియనే ♦ త్రంబుల్ దగన్ మూసి యా
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనా ♦ కారంబులన్ మానినీ.

మ॥ కరియుమ్ముఖ్యున నదులెల్ల వంకరవమా ♦ కర్షించి సంజాతమో
హములన్ మన్మథసాయకక్షత విశా ♦ లావర్తలై హంసవా
క్యములం జీరి తరంగహస్తముల నా ♦ కర్షించి పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ ♦ రామా! విలోకించితే.

—శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతం బెత్తుట.—

శా॥ బాలుండాడుచు నాతపత్రమని సం ♦ భావించి పూగుత్తి కెం
గేలం దాల్చిన లీలతేనగవుతోఁ ♦ గృష్ణుండు దానమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపుల ♦ ఛత్త్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుత వార్శిలాచకిత గో ♦ పీగోప గోపంక్తికిన్.

శా॥ బాలుండీతఁడు కొండదొడ్డది మహా ♦ భారంబు సైరింపఁగాఁ
జాలండో యని దీనికిందనిలువన్ ♦ శంకింపఁగాఁ బోలదీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరా ♦ చక్రంబు పైఁ బడ్డ నా
కేలల్లాడదు బంధులార! నిలుఁడీ ♦ క్రిందన్ బ్రమోదంబునన్.

మ॥ హరిదోర్దండము గామ గుబ్బ శిఖరం ♦ బాలంబి ముక్తావళుల్
వరగన్ జారెడు తోయబిందువులు గో ♦ పాలాంగనా పాంగహా
సరుచుల్ రత్నచయంబుగాఁగ నచల ♦ ఛత్త్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్దద ధారజిత జలధరా ♦ క్లిన్నవ్రజారంజియై.

—శరద్రాత్రింగావమునప్పు కృష్ణునిసన్నిధికి గోపికలువచ్చుట—

శా॥ మేలా మీకు భయంబుపుట్టదుగదా ♦ మీమందకున్ సింహశా
ర్దూలానేకపముఖ్యముల్ దిరిగడిన్ ♦ దూరంబులేతెంతురే
వేళావచ్చితిరీనిశాసమయమం ♦ దిచ్చోటవర్తింతురే
బాలంజాలు లతాంగులార! చనుఁడా ♦ సంప్రీతితో మందకున్॥

శా॥ మీరేతెంచినదాడఁ గానకిపగన్ ♦ మీతల్లులుం దండ్రులున్
మీరాయుల్ మఱఁదుల్ తనూజులు గురుల్ ♦ మీసోదరుల్ బంధు

వుల్

నెగ్గ మిాఱిరి లేరు పోయిరనుచున్ ♦ యీఘోషభూభాగముం
దేరీతిన్ బరికించిరో తగవు లే ♦ యీసాహసోద్యోగముల్.

చ॥ ఇలువడి సున్న సేసి హృద ♦ యేశుల సిగ్గులుపుచ్చి యుత్తమా
మలనెరిఁగించి సోదరుల ♦ మానము నూఱులుపుచ్చి తల్లిదం
డ్రుల రుచిమాన్పి బంధువుల ♦ గోతయొనర్చుచు జారవాంఛ
లన్
వలనటె సత్కులాంగనలు ♦ వత్తురె లోకులు సూచి నవ్వరే.

సీ॥ ప్రాణేశుఁ డెట్టిగేఁనఁ ♦ బ్రాణంబునకుఁ దెగు
దండించు నెట్టిగిన ♦ ధరణివిభుఁడు
మామ యెట్టింగిన ♦ మనువెల్లఁ జెడిపోవు
దలవరి యెట్టిగినఁ ♦ దగవు సేయుఁ
దలిదండ్రులెట్టిగినఁ ♦ దలలెత్తుకొందురు
కేరా లెట్టింగిన ♦ నత్తిపోషము
నాత్మజు లెట్టిగిన ♦ నాదరింపరు చూచి
బంధువు లెట్టిగిన ♦ బహిరొనర్తు

ఆ॥ రితరు లెట్టిగిరేని ♦ నెంతయుఁ జుల్కగా
జూతురిందు నందు ♦ సుఖము లేదు
యశము లేదు నిర్భ ♦ యానందమును లేదు
జారుఁ జేరఁ జనదు ♦ చారుముఖి॥

క॥ నదవడి నొంటిగా కున్నను
బడుగైనఁ గురూపియైనఁ ♦ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను
విడుచుట మర్యాద గాదు ♦ విభు నంగనకున్.

చ॥ ఇది యమునానదీజలద ♦ మేధితపాదపపల్లవప్రసూ
నదళవిరాజితం బగువ ♦ నంబు మనంబులు మెరదప్పెనో

పాదిగిటనేమ్ము బిడ్డలకుఁ ♦ బోయుఁచు పాలు విడుందు శేకలన్
మొదవులకున్ నిజేశ్వరుల ♦ ముద్దియ లారభజింపుఁ డౌవ్వగన్.

చ॥ వనితలునన్నుఁ గోరియుట ♦ వచ్చితి రింత గొఱంతలేదు మే
లొనరె సమస్తజంతువులు ♦ నోలిఁబ్రియంబులు గావెనాకునై
ననుదిలువంగఁ బోలదు స ♦ నాతనధర్మము లాడువారికిన్
జెనిమిటులన్ భజించుటలు ♦ పెద్దగ సెప్పుచు నుందురెల్లెడన్॥

క॥ ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నాతలంపు ♦ గలిగినఁ జాలుం
బూనదరు కృతార్థత్వము
మానవతుల్ చనుఁడుమగలి ♦ మందిరములకున్.

—[ గోపికాగీతలు ]—

ఉ॥ గోవుల వెంటఁ దిమ్మరుచుఁ ♦ గొల్చినవారల పాదసంఘముల్
దోవఁగఁ జాలి క్రిందనరి ♦ దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం
భావితమైన నీచరణ ♦ పద్మము చన్నులమీద మోపి త
ద్భావజపుష్ప భల్లభవ ♦ బాధ హరింపు వరింపుమాధవా.

మ. ఘనలక్ష్మీయుతమై కనన్ శుభదమై ♦ కామాది విధ్వంసియై
వనజ దిన్నుతమై నిరంతరతప ♦ స్వాంతప్తపుణ్యాగజే
వనమైయొప్పు నీ కథామృతము ద్రా ♦ వంగల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మా ♦ నారీమనోనాయకా.

ఉ॥ మాపటివేళ నీవు వన ♦ మధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపిత ధూళిధూసరిత ♦ భాసితకుంతలమై సరోరుహాభా
దీపితమైన నీ మొగము ♦ ధీరజనోత్తమ నాకు వేడ్కతో
జూపిమనంబులన్ మరునిఁ ♦ జూపుదుగాదె క్రిమక్రిమంబునన్.

ఉ॥ నీవడవిఁ బవల్ దిరుగ ♦ నీకుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమి ♦ షంబులు మాకు యుగంబులై చనున్
గావున రాత్రులందు నిను ♦ గన్నులనెప్పుడు జూడకుండ ల
క్ష్మీవర ఱెప్పలడ్డముగఁ ♦ జేసెని దేల విధాతక్రూరుఁడై.

మ॥ అరవిందంబులకంటెఁ గోమలములై ♦ యందంబులై యున్న నీ
చరణంబుల్ గఠినంబులై మొనయు ఱా ♦ దన్నుంగవల్ మ్రోవఁగా
నిరయంబుంగోలు నటంచుఁ బొక్కుదుము నీ ♦ యాకర్క శారణ్యభూ
పరిసంచారము కృష్ణ నీప్రియులకుం ♦ బ్రాణవ్యథం జేయదే.

—రాసక్రీడ—

చ॥ నడుములు వీఁగియాడఁ జడలు ♦ నవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁ ♦ జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
పొడమఁ గురుల్ చలింప శ్రుతి ♦ భూషణముల్ మెఱవంగ సక్తలై
పడఁతుకలాడుచుం జెలఁగి ♦ పాడిరి మేఘతటిల్లతాప్రభన్.

సీ॥ చెలువయొక్కతె చక్కఁ ♦ జెక్కుతో మోపిన
విభుఁడు దాంబూల చ ♦ ర్వితము వెట్టె
నాడుచు నొక లేమ ♦ యలసినఁ బ్రాణేశుఁ
డున్నత దోస్తంభ ♦ మూఁతసేసెఁ
జెమరించి యొకబాల ♦ సేరినఁ గడగోరఁ
జతురుఁడు కుచఘర్మ ♦ జలము వాపె
నలకంబు లొకయింతి ♦ కళికవారుల రేఖ
నంటినఁ బ్రియుఁడు వా ♦ యంగ దువ్వె.

ఆ॥ పడఁతియొకతె పాట ♦ పాడి దస్సిన
నధరామృతమున నాథుఁ ♦ డాదరించె
హార మొక్కసతికి ♦ నంసావృతంబైనఁ
గాంతుఁ డురముఁ జేర్చి ♦ కౌఁగిలించె.

—కంసుని పంపున నక్రూరుండు బృందావనమునకుఁ జనుదెంచుట—

మ॥ ఎట్టితపంబు సేయఁబడె ♦ నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టిధనంబు లర్థులకు ♦ నీఁబడెనో తొలిబామునందు నా
యట్టివివేక హీనునకు ♦ నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగలేని యీశ్వరుని ♦ బ్రహ్మమయుం హరిఁజూడఁ గల్గెడిన్.

ఉ॥ సూరులుఁదొల్లి యేవిభుని ♦ శోభితపాదనఖ ప్రభావళిం
జేరి భవాంధకారములఁ ♦ జిక్కక దాఁటుదు రట్టి దేవరన్
వైరముతోడనైనఁ బిలు ♦ వన్ ననుఁబంచి శుభంబు సేసెని
ష్కారణమైన ప్రేమనిదె ♦ కంసునిఁబోలు సఖుండు గల్గునే.

మ॥ ఇతఁడాకంసునిచేతఁ బంపువడి నన్ ♦ హింసింపనే తెంచినాఁ
డతిదుష్టుండని చూచునో సకలభూ ♦ తాంతర్బహిర్మధ్యసం
గతుఁడౌటం దలపోసి నన్ను సుజనుం ♦ గాఁజూచునో మెట్టియు
న్నతిఁగావించును యేక్రియంబలుకునో ♦ నాభాగ్య మెట్లున్నదో.

మ॥ అలకభ్రాజితమై సుధాంశునిభమై ♦ హాసప్రభోద్దామమై
జలజాతంబయి కర్ణకుండలవిరా ♦ జద్గండమై యున్నయా
జలజాతాక్షు ముఖంబుసూడఁ గలుగున్ ♦ సత్యంబువో నాకు నా
వలదిక్కేఁగుచు నున్నవీవనమృగ ♦ వ్రాతంబు లీత్రోవలన్.

ఉ॥ మాపటివేళ నేనుజని ♦ మాధవుపాద సమీపమందు దం
డాపతితుండనైన నతఁ ♦ డాశుగకాల భుజంగవేగ సం
తాపితభక్తలోక భయ ♦ దారణమైనకరాబ్జ మాదలన్
మోపిహసించి నాకభయ ♦ మున్ గృపతోడుతనీయకుండునే.

కంసవధ

వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి మత్తులంబాది
కంసుం డిట్లనియె.

ఉ॥ వల్లవబాలురన్ నగరి ♦ వాకిటికిన్ వెడలంగఁ ద్రొబ్బుఁడీ
గొల్లలముట్టికోల్ గొనుఁడు ♦ కూరిమినందుని గట్టుఁ డుర్వికిం
జెల్లముగాఁగ నేఁడు వసు ♦ దేవునిఁ జంపుఁడు తండ్రిగాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల ♦ కిష్టుఁడు గావునఁ దుగ్రసేనునిన్.

వ. అని పలుకు సమయంబున,

శా॥ జంఘాలత్వముతో నగోపరిచర ♦ త్సారంగ హింసేచ్ఛను
ల్లంఘింపంగమకించు సింహముక్రియన్ ♦ లంఘించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరికిం ♦ సవ్యాపసవ్యస్థుఁడై
లంఘించెం దమకంబు మీఱ దికి రణో ♦ ల్లాసంబు భాసిల్లఁగన్.

క॥ తమకమున నెగురుయదుస
త్తమగణ్యునిఁ జూచి ఖడ్గ ♦ ధరుఁడై యెదిరెం
దమకమువారలు వీరో
త్తమగణవిభుఁ డనఁగఁ గంస ♦ ధరణీపతియున్.

శా॥ పక్షీంద్రుండురగంబు బట్టువిధమై ♦ దప్పం గేశబంధంబు తో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణులా ♦ కల్పాంత వేళాపత
న్నక్షత్రంబులభంగిరాల రణాస ♦ న్నాహంబు రెట్టింప రం
గక్షోణింబడఁ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం ♦ గంసున్ నృపోత్తంసునిన్.

శా॥ మంచాగ్రంబుననుండి రంగధరణీ ♦ మధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జనులా ♦ శ్చర్యంబునం బొందఁగాఁ
బంచత్వంబును బొందియున్న విమతుం ♦ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్ ♦ బాహాబలోల్లాసియై.

—భ్రమరగీతలు.—

మ॥ భ్రమరా దుర్జనమైత్రి ముట్టకుము మా ♦ పాదాబ్జముల్ సోఁకం
బ్రియుదాళీకుచకుంకుమాంకితలస ♦ త్ప్రాణేశ దామప్రసూ

నమరందారుణి తానుండవగుటన్ ♦ బాధుండు మన్నించుఁ గా
కమము న్నేపుచుఁ బౌర కాంతలసభా ♦ గారంబుల న్నిత్యమున్

మ॥ ఒకపుష్పాందలి తేనెఁ ద్రావి మధుపా ♦ యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడు భంగి మన్మధరిపీ ♦ యూషంబు సందేల్చి, మా
యకలంకోజ్వల యౌవనంబుఁ గొనియ ♦ న్యాసక్తుఁడయ్యెన్ విభుం
డకటా యాతపశాల్లు దక్క సిరిమి ♦ ధ్యాకీర్తనమ్మొంజామా.

శా॥ భృంగా! కృష్ణుఁడు మంచివాఁడనుచు నం ♦ ప్రీతిం బ్రశంసించెదీ
సంగీతంబున నేము సౌఖ్యదుమ ♦ చ్చారిత్రముల్ వింత లే
యుంగీకారము కావుమాకుఁ బుర కాం ♦ తాగ్రిద్రి దేశంబులన్
సంగీతంబొనరింపు వారిమదురో ♦ జన్నికుని ప్తారముల్ ♦

మ. సవదాళీశ్వర! చూడు ముజ్జ్వలితచా ♦ సభ్రూవిజృంభంబులన్
రమణీయుండగు శౌరిచేఁగరఁగరే ♦ మల్ త్రిలోకంబులం
బ్రమదారత్నములక్ష్మి గూఁతటవదా ♦ బ్జాతంబు సేవింవ సి
క్క్ మానే మెవ్వరమా కృపాజలధికిం ♦ గారుణ్యముం జేయఁగన్.

శా. గోలంబేశ్వరు నికు దాత్యము మహా ♦ రూఢంబువి నేరుపుల్
పాలున్ మచ్చారణాబ్జముల్ వినువుము ♦ స్మన్నాథపుత్రాదులన్
లీలం బాసి వరంబు డించి తనకున్ ♦ లీఁ త్వముం బొందుము
మ్మేలా పాసివిభుండు ధార్మికులు మం ♦ న్నిచందముల్ మెత్తురే।

శా. గాలింజం పెను వేటకాని పగిదిన్ ♦ పంచించి దైత్యానుజన్
గోలం బట్టి విరూపఁ జేసెను బలిన్ ♦ లోభంబుఁ గట్టి యా
త్రైలోక్యంబు మెఱింగిపుచ్చె గొనియెన్ ♦ ధర్మజ్ఞుఁడే మాధవుం
డేలా పట్టుదు! యొగ్గు రూపలసి ♦ కగ్గింపఁగా నేటికిన్.

ఉ. చన్నుగ మింటిపై కెగసి ♦ నాఋనివాంగి బలైననీరాం
దన్నుకమాటుపిన్న గృహా ♦ దారసుతాదులఁ బాసి విత్తసం

తన్నుఁదలంచి సంసరణ ♦ పద్ధతిఁ బాపెడు వాఁడునిత్యశాం
తున్నతినున్న మాబ్రతుకు ♦ సైచునె యేలముకుంద్రతోత్తమా!

మ. కమనీయంబగు వేటకాని వదురా ♦ కర్ణించి నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి చేరిహరిణుల్ ♦ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథనొందు భంగిహరి మా ♦ యాలాపముల్ సమ్మదుః
ఖములం జెందితి మంగజాస్త్రజనితో ♦ గ్రశ్రాంతినిందిందిరా!

ఉ. బంధులబిడ్డలన్ మగల ♦ భ్రాతలఁదల్లులఁ దండ్రులన్ మనో
బాంధతఁ జేసిడించి తను ♦ నందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁద్రోచి చను ♦ చేరకపోవుట పాడిగాదు పు
ష్పంధయ! యీయధీశునకుఁ ♦ బాదప లంబడియొత్తి చెప్పవే!

సీ. కాంచనరత్నసం ♦ ఘటితసౌధంబు లే
మాకుటీరంబులు ♦ మాధవునకు
వివిధసౌందర్య సీ ♦ వితరాజధాని యే
మాపల్లెయదువంశ ♦ మండనునకు
సురభిపాదపలతా ♦ శోభితారామమే
మాయరణ్యముసింహ ♦ మధ్యమునకు
గమనీయులటుగ ♦ గజతురంగంబులే
మాధేనువులు కంస ♦ మర్దనునకు

తే. గీ. నానావిభ్రమనైపుణ ♦ రూఢలైన
మగువలము మేము మన్మథ ♦ మన్మథునకు
నేలచింతించుమము కృష్ణుఁ ♦ డేలతలఁచుఁ
బృథివినధిపులు నూతన ♦ ప్రియులుగారె!

—ఉద్ధవునిచేఁ గృష్ణుఁడు గోపికలకు సందేశముఁ బంపుట—

సీ. ఎల్లకార్యములకు ♦ నేను బీజంబు కా
రణముఁ గావున మీకు ♦ భామలార
కలుగదు మద్వియో ♦ గము చరాచరరూప
ములలో మహాభూత ♦ ములు వసించు
కరణి నుండుదు సర్వ ♦ గతుఁడనై నేమనః
ప్రాణబుద్ధి గుణేంద్రి ♦ యాశ్రయుండ
నాత్మయందాత్మచే ♦ నాత్మఁ బుట్టింతు ర
క్షింతు నడఁతు హృ ♦ షీకభూత

తే. గుణగణాకారమాత్మకుఁ ♦ గొమరుమిగులు
నిబిడమాయానుభవమున ♦ నిత్యశుద్ధ
మాత్మవిజ్ఞానమయమునై ♦ యమరుగుణము
బ్రకృతికార్యమనోవృత్తిఁ ♦ బట్టిపొందు॥

చ. కలఁగని లేచి మున్ను గలఁ ♦ గన్న సమస్తవిధంబుఁ గల్లగాఁ
దలఁచినభంగి మానసవి ♦ దార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తజ్జ్ఞుఁడు వి ♦ పంచము లేదను దన్మనంబుఁ దా
గలయఁగఁ గట్టుడున్ బుధుల ♦ కవ్వల నెందొక భేదమున్నదే.

ఆ. సాంఖ్యయోగనిగమ ♦ సత్యతపోదమ
ములు మనోనిరోధ ♦ మునకు దవల
గాఁగ నుండు జలధి ♦ కడవలగాఁగల
నదులభంగి సలిల ♦ నయనలాగ॥

మ. చెలువల్ దవ్వులనున్న వల్లభులపైఁ ♦ జిత్తంబులం జూత్తురు
త్కలికం జేరువవారికంటె నదియుం ♦ గాకెవ్వనున్నన్ మీ
గలుచింతించుచు నుండఁగోరి యిటు దూ ♦ రస్థత్వముం బొందితిన్
దలకంబోలను నన్నుఁ గూడెదరు ని ♦ త్యధ్యానపారీణలై॥

—గోపికలు మరలఁ గృష్ణునకుఁ బంపిన సందేశము—

సీ. తను బాసి యొక్కింత ♦ తడవైన నిట వీడ
నేలపై మేనులు ♦ నిలువవనుము
నేలపై మేనులు ♦ నిలువకయుటమున్న
ధైర్యంబులొక్కటఁ ♦ దలఁగుననుము
ధైర్యంబులొక్కటఁ ♦ దలఁగినపిమ్మటఁ
జిత్తంబులిక్కడఁ ♦ జిక్కవనుము
చిత్తంబులిక్కడఁ ♦ జిక్కకవచ్చినఁ
బ్రాణంబులుండక ♦ పాయుననుము

తే. ప్రాణములుపోవ మాకు ♦ వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణరక్షకుఁడగు తన్నుఁ ♦ బ్రాణులెల్ల
జేరి, దూఱంగ మాకేమి ♦ సేయువాఁడు
వేగవిన్నప మొనరింప ♦ వే మహాత్మ॥

—రుక్మిణీసందేశము—

సీ. వినిగుణములు క ♦ ర్ణేంద్రియంబులసోఁక
దేహతాపంబులు ♦ దీఱిపోవు
నిన్ను భాసుర ♦ విగ్రహించఁగన్నుల
కఖిలార్థలాభంబు ♦ గలుగుచుండు
నిన్ను చరణసేవ ♦ లేపొద్దు చేసిన
భువనోన్నతత్వంబు ♦ బొందఁగలుగు
నీవిలసన్నామ ♦ మెపొద్దు భక్తితోఁ
దడవిన పావనం ♦ తతులు వాయు

తే. వట్టి సిగ్గాగు నాచిత్త ♦ మనవరతము
నచ్చియున్నది నీయాన ♦ నానలేదు

కరుణఁజూడుము కంసారి ♦ ఖలవిదారి
శ్రీయుతాకార మానినీ ♦ చిత్తచోర।

శా॥ ధన్యుల్ లోకమనోభిరాముఁ గులవి ♦ ద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణా ♦ సంశోభితుల్ నిన్ను నే
కన్యల్ గోరరు కోరదే మును రమా ♦ కాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నావలన నే ♦ జన్మించె నీమోహముల్।

ఉ॥ శ్రీయుతమూర్తి యో పురుష ♦ సింహము సింహము పాలిసొమ్ము గో
మాయువు గోరుచందమున ♦ మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
ధ్యాయినినైన నన్ను వడిఁ ♦ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డాయధమాధముం డెఱుఁగఁ ♦ డద్భుతమైన భవత్ప్రతాపముల్।

మ॥ వ్రతముల్ దేవగురుద్విజన్మబుధ సే ♦ వల్ దానధర్మాదులుం
గతజన్మంబుల నీశ్వరుం బరిజగ ♦ త్కల్యాణుఁ గాంక్షించి చే
సితినేనిం బసుదేవనందనుఁడు నా ♦ చిత్తేశుఁడౌఁ గాక ని
ర్జితులై పోదురుగాక సంగరములోఁ ♦ జేదీశముఖ్యాధముల్।

ఉ॥ అంకిలిసెప్ప లేదు చతు ♦ రంగబలంబులతోడ నల్లియో
పంకజనాభ! నీవు శిశు ♦ పాలజరాసుతులం జయించి నా
వంకకువచ్చి రాక్షసవి ♦ వాహమునన్ భవదీయశౌర్య మ
యుంకువసేసి కృష్ణ! పురు ♦ షోత్తమ! చేకొనిపొమ్ము వచ్చెదన్.

సీ॥ లోవలిసౌధంబు ♦ లోనవర్తింపంగఁ
దేవచ్చునే నిన్నుఁ ♦ దెత్తునేని
గావలివారలఁ ♦ గలబంధువులఁ జంపి
కాని తేరాదని ♦ కమలనయన
భావించితేని ను ♦ పాయంబు సెప్పెద
నాలింపుకులదేవ ♦ యాత్రఁ జేసి

నగరంబు వెలువడి ♦ నగజాతకును మ్రొక్కఁ
బెండ్లికిని నువడఁ ♦ బెండ్లికూతు

తే॥ నెలది మూఁవారు దంపుదు ♦ లేనునట్ల
పురము వెలువడి యేతెంచి ♦ భూతనాథు
సతికి మ్రొక్కంగనీవు నా ♦ సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను న ♦ నార్యచరిత॥

మ॥ ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై ♦ గౌరీశు మర్యాదన
న్నీ పాదాంబుజతోయమందు మునుఁగన్ ♦ వాంఛింతు రేనట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచ ♦ ర్యన్ నూరుజన్మంబులన్
నినుఁజింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ ♦ నిక్కంబు ప్రాణేశ్వరా॥

సీ॥ ప్రాణేశ! నీమంజు ♦ భాషలు వినలేని
కర్ణరంధ్రంబుల ♦ కలిమి యేల
పురుషరత్నమ! నీవు ♦ భోగింపఁగా లేని
తనులతవలని సౌం ♦ దర్యమేల
భువనమోహన! నిన్నుఁ ♦ బొడఁగానఁగా లేని
చక్షురింద్రియముల ♦ సత్త్వమేల
దయిత! నీయధరామృ ♦ తంబానఁగా లేని
జిహ్వాకు ఫలరస ♦ సిద్ధియేల

ఆ॥ నీరజాతనయన! ♦ నీవనమాలికా
గంధమబ్బలేని ♦ ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు ♦ దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని ♦ జన్మములకు॥

—౯ స్వయంవరసమయమునకుఁ గృష్ణుఁడు రాలేదని తలంచి రుక్మిణి చింతించుట. ౯—

శా॥ లగ్నం బెల్లి వివాహముం గదిసె నే ♦ లా రాఁడు గోవిందుఁ డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినదోర్వ ♦ త్రాంతమ్ముఁ బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెనో ♦ యత్నంబు సిద్ధించునో
భగ్నం బై చనునో విరించికృత మె ♦ బ్బంగిం బ్రవర్తించునో॥

మ॥ ఘనుఁ డా భూసురుఁ డేగెనో నడుమ మా ♦ ర్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగాఁ దలఁచెనో ♦ విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో ♦ యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో ♦ నా భాగ్య మెట్లున్నదో.

ఉ॥ పోఁడను బ్రాహ్మణుండు యదు ♦ పుంగవు వీటికి వాసుదేవుఁడున్
రాఁడను సింకఁ బోయి హరి ♦ రమ్మని చీరెడు నిష్టబంధుఁడున్
లేఁడను రుక్మి కిందగవు ♦ లేదిటఁ జైద్యున కిత్తునంచు నా
వాఁడను గౌరి కీశ్వరికి ♦ నావలసంగ్రహ లేదు నేఁడనున్.

ఉ॥ చెప్పదు తల్లికిం దలఁపుఁ ♦ జిక్కఁదిశల్ దరహాసచంద్రికం
గప్పదు వక్త్రతామరస ♦ గంధసమాగత భృంగసంఘమున్
రొప్పదు నిద్రఁ గైకొనదు ♦ రోజ పరస్పర సక్తహారముల్
విప్పదు కృష్ణమార్గగత ♦ వీక్షణపంక్తులు ద్రిప్పదెప్పుడున్.

చ॥ తుడువదు కన్నులన్ వెడలు ♦ తోయకణంబులు కొప్పు జక్కఁగా
ముడువదు నెచ్చెలిం గదిసి ము ♦ చ్చటకుం జన దన్నమేమియుం
గుడువదు సీరయుం గొనదు ♦ కూరిమిఁ గీరముఁ జేరి పద్యముల్
నుడువదు వల్లకీగుణ వి ♦ నోదము సేయదు డాయ దన్యులన్.

సీ॥ మృగనాభి యలఁదదు ♦ మృగరాజమధ్యమ
జలములనాడదు ♦ జలజగంధి
ముకురంబు సూడదు ♦ ముకురసన్నిభముఖి
పువ్వులు దాఁ ముడువదు ♦ పువ్వుఁబోఁడి

వనకేళిఁ గోరదు ♦ వనజాతలోచన
హంసంబుఁ బెంపదు ♦ హంసగమన
లతలఁ బోషింపదు ♦ లతికాలలితదేహ
తోడవులు దొడవదు ♦ తొడవుతొడవు

ఆ॥ తిలకమిడదు నుదుట ♦ దిలకినీతిలకంబు
కమలగృహము సొరదు ♦ కమలహస్త
గారవించి తన్నుఁ ♦ గరుణఁ గైకొన వన
మాలిరాఁడు తగవు ♦ మాలియనుచు.

మ॥ మలఁగున్ మల్లని గాలికిన్ బటురట ♦ న్మత్తద్విరేఫాళికిన్
దలఁగున్ గోయిలమ్రోఁతకై యులఁకు ను ♦ ద్యత్కీరసంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడిమిన్ నలఁగు న ♦ క్కందాంకురచ్ఛాయకున్
దొలఁగుం గొమ్మ మనోభవానల శిఖా ♦ దోధూయమానాంగియై.

—(కృష్ణుఁడు సత్యభామను బెండ్లియాడుట)—

వ. ఇట్లు హరి తనపురాకరిమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి తద్వృత్తాంతంబంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణినిచ్చె నతఁడును సిగ్గుపడి మణిం బుచ్చుకొని, పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిం జని,

క॥ పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి ♦ పద్మాక్షునిపైఁ
బాపముగలదని నుడివిన
పాపాత్ముని పాపమునకుఁ ♦ బారముగలదే.

మ॥ మిథ్యాభాషిత్వముమాని యేలహరిపై ♦ మిథ్యాభియోగంబుచే
సితిఁ బాపాత్ముఁడ నర్థలోభుఁడను దు ♦ శ్చిత్తుండ నత్తుండ దు

ర్మతి నిదేహముఁ గాల్పనే దురిత మే ♦ మార్గంబునం బాయునే
గతిఁ గంసారి బ్రసన్నుఁడై మనుచు నన్ ♦ గారుణ్యభావంబునన్.

ఆ॥ మణినిఁ గూతు నిచ్చి ♦ మాధవు పదములు
పట్టుకొంటి నేని ♦ బ్రతుకఁగలదు
సంతసించు నతఁడు ♦ సదుపాయ మగు నిది
సత్యమితర వృత్తి ♦ జిక్కఁబడదు.

మ॥ అని యిబ్భంగి బహుప్రకారముల నే ♦ కాంతస్థుఁడై యింటిలోఁ
దనబుద్ధిం బరికించి నీతిఁ గని స ♦ త్రాజిత్తు సంప్రీతితో
ధనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ ♦ భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాం ♦ తారత్నమున్ రత్నమున్.

ఉ॥ తామరసాక్షుఁ డచ్యుతుఁడు ♦ దారగుణోనిధి పెండ్లియాడె నా
నామనుజేంద్ర నందితగుణ ♦ స్థితిలక్షణ సత్యభామ ను
ద్దామగతివ్రతాత్మనయ ♦ ధర్మవిచక్షణ గాదయా యశః
కామను సత్యభామను సు ♦ ఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్.

క॥ మణి యిచ్చినాఁడు వానర
మణినికను మాకుఁ గలపు ♦ గుణులకు హారీ
మణిచాలు నంచు కృష్ణుఁడు
మణి సత్రాజిత్తునకును ♦ మరలఁగ నిచ్చెన్.

—(సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుట)—

శా॥ ఆ విల్లంది బలంబు నొంది తదగ ♦ ణ్యానంత తేజోవిశే
షావిర్భూతమహా ప్రతాపవనసీ ♦ మాలోక సల్లోకయై
తా వేగన్ సగుణంబుఁ జేసి ధనువుం ♦ దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణ ♦ క్రీడామహోత్కంఠతోన్.

క॥ నారి బొరయించె రిపుసే
నారింఖణహేతువైన ♦ నాదము నిగుడన్
వారీమణి బలసంఖ
వ్యారీభాదికము మూర్ఛ ♦ నందె నరేంద్రా.

సీ॥ సౌవర్ణకంకణ ♦ ఝణఝణనినదంబు
శింజినీరవముతోఁ ♦ జెలిమి సేయఁ
దాటంకమణిగణ ♦ ధగధగ దీప్తులు
గండమండలి రుచి ♦ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ♦ ధళధళ రోచులు
బాణజాలప్రభా ♦ పటలి నడప
శరపాత ఘుమఘుమ ♦ శబ్దంబు పరిపంథి
సైనికకలకల ♦ స్వనము నుడుప.

తే॥ వీరశృంగార భయరౌద్ర ♦ విస్మయములు
గలసి భామిని యొప్పెనో ♦ కాకయనఁగ
నిషువుదొడఁగుట దివుచుట ♦ యేయుటెల్ల
నెఱుఁగరాకుండ నని సేసె ♦ నిందువదన.

మ॥ పరుఁజూచున్ వరుఁజూచు నొంపనలరిం ♦ పన్ గోపరాగోదయా
విరగభ్రూకుటి మందహాసములతో ♦ వీరంబు శృంగారమున్
జరగంగన్నులఁ గెంపు సొంపు బరగం ♦ జండాస్త్ర సందోహమున్
వరసాలోకనమూహమున్ నెఱపుచున్ ♦ జంద్రాస్య హేలాగతిన్.

మ॥ అలినీలాలక చూడ నొప్పెనఁగ బ్ర ♦ త్యాలీఢపాదంబుతో
వలిక స్వేద వికీర్ణ కాలకలతోఁ ♦ నాకర్ణ కానీత స
ల్లలితజ్యానఖపుంఖధీధితులతోఁ ♦ లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖ ♦ వ్రాతాహతారాతియై.

సీ॥ బొమ్మపెండ్లిండ్లకు ♦ బోనొల్లదను బాల
రణరంగమున కెట్లు ♦ రాఁదలంచె
మగవారిఁగనినఁ దా ♦ మఱుఁగు చేరెడునింతి
మగవారి గెల్వఁ జే ♦ కగిడి బోదెఁ
పసిఁడి యుయ్యాలలెక్క ♦ భయమందు తరుణి
ఖగపతిస్కంధ మే ♦ కడిది నెక్కె
సఖుల కోలాహల ♦ స్వనము కోర్వనికన్య
పటహా భాఁకృతుల కె ♦ బ్భంగి నోర్చె

ఆ॥ నీలకంఠములకు ♦ నృత్యంబు గఱపుచు
నలసి తూఁగిపోవు ♦ నలరుఁబోఁడి
యేవిధమున నుండె ♦ నెలమి నాలీఢాది
స్థానములను రిపుల ♦ మానమడఁచు.

సీ॥ వీణెఁ జక్కఁగఁ బట్ట ♦ వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు ♦ బట్టనేర్చె
మాత్రికునఁదీఁగెఁ గూ ♦ ర్పంగ నేరని లేమ
గుణము నేక్రియ ధనుః ♦ కోటిఁ గూర్చె
సరవిమాల్యము గ్రువ్వఁ ♦ జాలని యబల యే
నిపుణత సంధించె ♦ నిశితశరము
చిలుకకుఁ బద్యంబు ♦ చెప్ప నేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ ♦ దభ్యసించె.

ఆ॥ పలుకుమనినఁ బెక్కు ♦ పలుకని ముగుద యే
గతినొనర్చె సింహ ♦ గర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిదశ ♦ దభిరామ గుణధామ
చారుసత్యభామ ♦ సత్యభామ॥

శా॥ జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ ♦ సారంగయూథంబుగా
నావిల్లింద్రశరాసనంబుగ సరో ♦ జాతుండు మేఘంబుగాఁ
దావిద్యుల్లతభంగినింతి సురజ ♦ ద్దానాగ్నిమగ్నంబుగాఁ
బ్రావృట్కాలముసేసె బాణచయముం ♦ భశ్శీకరశ్రేణిగాఁ.

సీ॥ రాకేందు బింబమై ♦ రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ ♦ నెమ్మొగంబు
కందర్పకేతువై ♦ ఘనధూమకేతువై
యలరుఁ బూఁబోఁడిచే ♦ లాంచలంబు
భావజపరిధియై ♦ ప్రళయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై ♦ మెలఁతచాప
మమృతప్రవాహమై ♦ యనలసందోహమై
తనరారు నింతిసం ♦ దర్శనంబు

ఆ॥ హర్షదాయియైన ♦ హారోషదాయియై
పరగుముద్దరాలి ♦ బాణవృష్టి
హరికినరికిఁ జూడ ♦ నందందశృంగార
వీరరసములోలి ♦ విస్తరిల్లు.

—శరతల్పగతుఁడగు భీష్ముఁడు శ్రీకృష్ణునిస్తుతించుట—

శా॥ ఆలాపంబులు మానిచిత్తము మనీ ♦ షాయత్తముంజేసిఁదృ
గ్జాలంబుల్ హరిమోముపైఁబఱపిత ♦ త్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూతశరవ్యథానిచయుఁడై ♦ మోదించిభీష్ముండుసం
శీలంబొప్పనుతించెఁ గల్మషగజ ♦ శ్రేణీహరిన్ శ్రీహరిన్.

మ॥ త్రిజగన్మోహననీలకాంతితనువు ♦ ద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభమైనచేలము పయిన్ ♦ రంజిల్లనీలాలక
వ్రజసంయుక్త ముఖారవిందమతిసే ♦ వ్యంబై విజృంభింపమా
విజయుంజేరెడు వన్నెకాఁడు మదినా ♦ వేశించు నెల్లప్పుడున్।

మ॥ హయరింఖాముఖధూళిధూసరపరి ♦ స్వస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై ♦ రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్కఁ బనివా ♦ శస్త్రాహతిం జాలనొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ ♦ జింతింతు నశ్రాంతమున్

మ॥ నరుమాటల్ విని నవ్వుతో నుభయసే ♦ నామధ్యమక్షోణిలో
బరులీక్షింప రథంబు నిల్పి పరభూ ♦ పాలావళిం జూపుచుం
బరభూపాయువులెల్లఁ జూపులన శుం ♦ భత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృ ♦ త్పద్మాసనాసీనుఁడై.

క॥ తనవారిఁ జంపఁ జాలక।
వెనుకకుఁ బోనిచ్చగించు ♦ విజయుని శంకన్
ఘనయోగవిద్యఁ బాపిన
మునివంద్యుని పాదభక్తి ♦ మొనయున్ నాకున్॥

సీ॥ కుప్పించి యెగసిన ♦ కుండలంబుల కాంతి
గగనభాగం బెల్లఁ ♦ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక ♦ యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున ♦ జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి ♦ చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని ♦ పటము జాఱ
నమ్మితి నాలావు ♦ నగుబాటు సేయక
మన్నింపుమని క్రీడి ♦ మరలఁ దిగువఁ

తే॥ గరికిలంఘించుసింహంబు ♦ కరణి మెఱసి
నేఁడు భీష్ముని జంపుదు ♦ నిన్నుఁ గాతు
విడువుమర్జున! యనుచుమ ♦ ద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు ♦ దిక్కు నాకు।

మ॥ తనకున్ భృత్యుఁడు వీఁడుగాఁ జుటమహా ♦ ధర్మంబువొమ్మించు స
ర్జునసారథ్యముపూని పగ్గములుచేఁ ♦ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ వడిఁబూన్చి ఘోటకములన్ ♦ మోదించితాడించుచున్
జనులన్ మోహమునొందఁ జేయుపర ♦ మోత్సాహుం బ్రశంసించెదన్

క॥ పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల ♦ నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలఁకులు వదలించుఘనునిఁ ♦ గొలిచెద మదిలోన్॥

ఆ. మునులు నృపులుఁజూడ ♦ మునుధర్మజుని సభా
మందిరమున యాగ ♦ మండపమునఁ
జిత్రమహిమతోడఁ ♦ జెలువొందు జగదాది
దేవుఁ డమరువాడు ♦ దృష్టియందు.

మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా ♦ నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహా ♦ లీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ ♦ నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచునుండునట్టి హరినేఁ ♦ బ్రార్థింతు శుద్ధుండనై॥

—♦ కుచేలచరిత్రసంబంధమగు పద్యములు ♦—

మ॥ కలలోనం దనమున్నెఱుంగని మహా ♦ కష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డా వత్సమయంబునన్ నిజపదా ♦ బ్జాతంబులుల్లంబులోఁ
దలఁపన్నంతనెమెచ్చి యార్తిహరుఁడై ♦ తన్నైననిచ్చున్ మని
శ్చలభక్తిన్ భజియించువారికిడఁడే ♦ సంపద్విశేషోన్నతుల్.

సీ॥ ఇందీవరశ్యాము ♦ వందితసుత్రాముఁ
గరుణాలవాలు భా ♦ సురకపోలు
గౌస్తుభాలంకారుఁ ♦ గామితమందారు
సురుచిరలావణ్యు ♦ సురశరణ్యు

హర్యక్షనిభమధ్యు ♦ నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు ♦ నగ్రప్రశస్తు
ఖగకులాధిపయానుఁ ♦ గౌశేయపరిధానుఁ
బన్నగశయను న ♦ బ్జాతనయను

తే. మకరకుండల సద్భూషు ♦ మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసా ♦ గరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాం ♦ భోధిచంద్రు
విష్ణురోచిష్ణు జిష్ణుస ♦ హిష్ణుఁ గృష్ణు॥

ఉ. ఏమితపంబు చేసెనొకొ ♦ యీధరణీదివిజోత్తముండు తొల్
లామున యోగివిస్ఫురదు ♦ పాస్యకుఁడై తనరారు నిజగ
త్స్వామిరమాధినాథు నిజ ♦ తల్పమునన్ వసియించుచున్న వాఁ
డీమహనీయమూర్తి యెన ♦ యేమునిపుంగవు లెంతవారలున్.

చ॥ తనమృదుతల్పమందు వని ♦ తామణియైనరమాలలామ పొం
దును నెడఁ గాఁదలంపక య ♦ మద్విజవరుం డెదురేఁగి మోదముం
దనుకఁగఁ గౌఁగిలించి యుచి ♦ తక్రియలం బరితుష్టుఁ జేయుచున్
వినయమునన్ భజించె ధర ♦ ణీసురుఁ డెంతటిభాగ్యవంతుఁడో॥

సీ॥ బ్రాహ్మణోత్తము వేద ♦ పాఠనలబ్ధ
తుణగలచారు వం ♦ శంబువలనఁ
బరిణయంబైనట్టి ♦ భార్యసుశీల వ
ర్తనములఁ దగభవ ♦ త్సద్వృత్తియగు న
తలఁపగృహక్షేత్ర ♦ ధనదారపుత్రాదు
లందునచిత్తంబు ♦ చెందకుంట
తోఁచుచున్నదియేను ♦ మదిలోకసంగ్రహా,
ర్థంబు కర్మాచర ♦ ణంబుసేయు

తే. గతిమనంబులఁ గామమో ♦ హితులుగాక
యుక్తిమై యుక్తకర్మంబు ♦ లాచరించి
హరికృతసంబంధములు వాసి ♦ భవ్యనిష్ఠ
దవిలియుందురు కొందఱు ♦ త్త్రములుభువిని.

క॥ దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ ♦ బాయనిభక్తిం
గొలిచినజనులర్పించిన
నెలమిన్ గొనిరాన్నముగను ♦ యేనుభుజింతున్.

క॥ మురహరుఁడు పిడికెడటుకులు
గర మొప్పఁగనారగించి ♦ కౌతూహలియై
మఱియును బిడికెడు గొనఁ ద
త్కరమప్పుడు పట్టెకమల ♦ కరకమలములన్.

క॥ సొంపారఁగ నితనికి బహు
సంపద లందింప నివియ ♦ చాలును నిఁక భ
క్తింపఁగవలదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ ♦ సర్వాత్మహరీ.

సీ॥ హరికింకరుఁ గృపగణ్య ♦ భాగ్యుండనైనట్టి
యేనేడ నిఖిలావ ♦ నీశ్వరైన
యిందిరాదేవికి ♦ నెనయంగ నిత్యని
వాసుఁడై యొప్పెడి ♦ వ్యాసు దేవుఁ
డెదవిస్మరిమైఁ ♦ దోడఁబుట్టినవాని
కైవడి కౌఁగిటఁ ♦ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను ♦ భావించి నిజతల్ప
మునఁ నుంచి సత్క్రియల్ ♦ పూని సలిపి

తే. చారు నిజవధూకర సరో ♦ జాతకలిత
చామరానిలమున గత ♦ శ్రమునిఁ జేసి
శ్రీలచాలిప్త చందనాం ♦ చితకరాబ్జ
తలములను బద్దులొత్తె వ ♦ త్సలత మెఱసి॥

ఉ॥ శ్రీనిధి యిట్లు నన్నుఁ బచ ♦ రించి ఘనంబుగ విత్తమేమియున్
నను తెలుంగు గానఁబడ ♦ నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడని ♦ కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరి ♦ పూర్ణునిగా ననుఁ జేయకుండునే.

—। సూర్యోదయము ।—

సీ॥ పౌలోమిదనబాలు ♦ పాన్పుపైఁ గనుపట్టఁ,
జిన్ని నవపడంపు ♦ బంతియనఁగ
నాయురర్థముల వ్య ♦ యంబులొత్తిలిచాటు
కాలజాంఘికుచేతి ♦ ఘంటయనఁగ
ఘనజంతుజీవిత ♦ కాలరాసులవిధి
కొలువనెత్తినహేమ ♦ కుంభమనఁగఁ
బశ్చిమదిక్కాంత ♦ పరఁగఁగైసేయుచో
ముందటనిడుకొన్న ♦ ముకురమనఁగఁ
తే. గోపతాపోకమణి మదివ్య ♦ ఘుటికమనఁగ
బద్మినీకాంతనోముల ♦ ఫలమనంగ
మూఁడుమూర్తులసారంపు ♦ ముద్దయనఁగ
మిహిరమండలముదయాద్రి ♦ మీఁదనొప్పె.

—। చంద్రోదయము ।—

సీ॥ ప్రాచీదిశాంగనా ♦ ఫాలతలంబున
దీపించుసింధూర ♦ తిలకమనఁగ

దర్పించి వీరభటుల ♦ ధైర్యవల్లులు ద్రెంచ
చర్మకుం డెత్తిన ♦ దాత్రిమనఁగ
సలిగి కాలకిరాతుఁ ♦ డంధ కారమృగంబు
ఖండింప మెఱయించు ♦ ఖడ్గమనఁగ
గగనరమాలవ్య ♦ కుసుమ తూర్పుకొమ్మను
లలితమై మెఱయుచు ♦ ల్లవమనంగ

ఆ. దొంగలు వంతసిల్ల ♦ దొంగలు భీతిల్లఁ
గడలి మిన్నుముట్టి ♦ కదలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు ♦ భూరిచకోరక
ప్రీతికరుఁడు జార ♦ భీతికరుఁడు.

సమాప్తము



# గ్రామోఫోను హాస్యపుపాటలు

వెల 0—6—0.

ఇది శ్రీవల్లూరి జగన్నాధరావుగారిచే రచియింపబడినది. ఇం
దు కోడిపాట, పడవపాట, లంజపాట, గోంగూరపాట, పక్షిబ్రాహ్మ
ణిపార్సు, పోలిపాట మొదలైనవి ముప్పయిరెండుపాటలు గలవు.
ంతవింతపాటలు, నవ్వువచ్చే పాటలు గలవు. వెల స్వల్పము, అనేక
యీపాటలు గ్రామోఫోనులో పాడబడుచున్నవి. ఇదివరకు
లుగుకూర్పులు పుస్తకములు అయిపోయినవి. ఇది ఐదవకూర్పు.
స్యపడినగాని ప్రతులు దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు.

# సంగీత విష్ణులీల

వెల 0—12—0

ఇందు శ్రీహరి అవతారములన్నియు నాటకముగా వ్రాయబడి
నవి. దీనియందు పార్శీకర్నాటకమట్లుగూడా గలవు. ఈప్లాటుగా
యింతకుమున్న యీనాటకము యెవ్వరిచేతను రచియింపబడియుండ
లేదు. ఈబుక్కు అచ్చువేయుచుండగనే అనేక ఆర్డరులు వచ్చియు
న్నవి. ఈనాటకము ప్రతివారి హస్తమందు వుండితీరవలెను. కొనితీ
రవలెను. చదివి ఆనందించి తీరవలెను. ప్రతిపుస్తకభాండాగారము
నందునలంకరించి తీరవలెను. ఆలస్యముచేసినచో ప్రతులుదొరకనేరవు.

# వేశ్యాహితబోధిని

వెల 1—0—0

ఇందు వేశ్యలయొక్క మహామోహాయములున్నూ, విటులగొ
వరితాపము, వేశ్యలకు మేడకట్టించి దివాలాతీయుటయు అనేక
వ చిత్రవిచిత్రమైన ఫాన్సులతో నింపియుండును. చాలా అద్భుత
గా యుండును.

సుబ్బారావు బుక్కుసెల్లర్,
మడ్డోలు, కృష్ణాజిల్లా.

# ఊర్వశీశాప విమోచనం:

**వెల 0—12—0 మాత్రమే.**

ఇది శ్రీ అయినాపురపు సుందరరామయ్యగారిచే రచియింపబడినది. అన్నిరసములు యిందుగలవు. ఇంద్రుడు శచీరంభలతో సరససల్లాపము. దూర్వాసుడు ఊర్వశిని యిప్పించమని ఇంద్రుని కోరుట. ఊర్వశిని ఇంద్రుడు రప్పించుట. ఊర్వశి బెట్టుసరిజేయుట. ఆఖరకు వప్పుకొనుట. దూర్వాసుడురసఉద్యానవనములోనికి వెళ్ళి కామముతో దపించుట. ఊర్వశి వచ్చుట. దూర్వాసుడు పైబడబోవుట. ఊర్వశి బెట్టుసరిజేయుట. దూర్వాసుడు కోపగించి ఊర్వశికి శాపము యిచ్చుట ఊర్వశి గుర్రముఅయి విక్రమసేనునకు దొరకుట. శ్రీకృష్ణుని కుమారుండైన మన్మధుడుకూడా ఊర్వశీగుర్రమునిమిత్తం ప్రయత్నము జేయుట మన్మధుడు యీగుర్రము దొరకేవరకు స్త్రీళ్ళాహారములు ముట్టను అని ప్రతిజ్ఞజేయుట నారదుడు మన్మధుని విక్రమసేనుదగ్గరకు గుర్రము కావలయునని పంపుట. విక్రమసేనుడు గుర్రము యివ్వనని చెప్పుట. మన్మధుడు సేనని కట్టించెదనని ప్రతిజ్ఞచేయుట. విక్రమసేనుడు అభిమన్యుని శరణుకోరుట. మన్మధుడు అభిమన్యునివద్దకు అక్రూరునిరాయభారిగా పంపుట. అభిమన్యుడువినవనని చెప్పుట. అభిమన్యమన్మధుల యుద్ధము బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమై యుద్ధము నాపుజేయుట. ఊర్వసి శాపవిముక్తయై మనుష్యరూపము పొందుట చాలా అద్భుతముగా నుండును, ఇదివరకు అనేకవేలప్రతులు ఖర్చు అయినవి. కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు, త్వరపడుడు.

వలయువారు:—

కురుకూరి సుబ్బారావు బుక్కుసెల్లర్,

భీమడోలు, కృష్ణాజిల్లా.

---